

చైనానుండి వచ్చిన సాంస్కృతిక ప్రతినిధి వర్గానికి శ్రీమతి ఇందిరాగాంధి,
సర్దార్ పణికర్ మొదలైనవారు స్వాగతం ఇచ్చారు.



# విషయానుక్రమణిక

## 1951 నవంబరు 7







# ఆంధ్రపత్రిక

సంవత్సరచందా
రు. 12-0-0
విడిపత్రిక
4 అణాలు

ప్రతి బుధవారము
ప్రకటింపబడును
Founder: K. NAGESWARA RAO

సంపుటము 44
సంచిక 10
7-11-51

ఖర సంవత్సర కార్తీక శుద్ధ నవమి బుధవారము

# కమ్యూనిస్టులు: ఎన్నికలు

ఎన్నికల ద్వారా పరిపాలనాధికారాన్ని స్వాధీనపరుచుకునే పద్ధతిలోగాని, సర్వవర్గాలవారికీ సమ్మతంగా గల శాంతి విధానాలద్వారా కమ్యూనిస్టు పరిపాలనను స్థాపించే పద్ధతిలో గాని కమ్యూనిస్టులకు (మార్క్సిస్టు - లెనినిస్టు-స్టాలినిస్టు పంథాననుసరించే వారికి) విశ్వాసం ఎన్నడూ లేదని అందరికీ తెలిసినదే. అయితే వారు ఎన్నికలలో పాల్గొనడం మానరు. ఇతరపార్టీలతో చేరి ప్రభుత్వ పార్టీని, దేశంలో బలంగా ఉండే ఇతర పార్టీలనీ బలహీనపరచడంకోసం కృషి చేస్తారు. కార్మిక కర్షక వర్గాలకు ప్రభుత్వాన్ని ఒప్పగించాలనే ఉద్యమంలో వీరు శాసన విధేయతనుపాటించకపోయినా, తమ ఉద్యమనిర్వహణకోసమూ, ఎన్నికల ప్రచారంకోసమూ తమ పార్టీపైనా సభ్యులపైనా విధించబడిన నిర్బంధాలను నిషేధాలను తొలగించాలని ప్రచారం చేస్తారు.

నిజానికి ఇందులో దాపరికమేమీ లేదు. మనదేశంలో కాని ఇతర దేశాలలో కాని కమ్యూనిస్టుల ఉద్యమ విధానాలను పరిశీలించినా, కమ్యూనిస్టుల కరపత్రాలను గమనించినా ఇది స్పష్టంగానే బోధపడుతుంది. కమ్యూనిస్టుల ఉద్యమవిధానం అనుభవాన్ని బట్టి వ్యూహాలూ తంత్రాలలో మార్పులు వచ్చినా, ఈ ప్రధానాంశాలలో భేదం మాత్రం ఉండదు. ఇకముందు కూడా మారదు. ఈ సత్యాన్ని దృష్టిలో పెట్టుకునే ప్రభుత్వమైనా ప్రజలైనా కమ్యూనిస్టులతో వ్యవహరించాలి. వీనిని దృష్టిలో పెట్టుకునే ఇప్పుడు కమ్యూనిస్టు నాయకులు చేస్తున్న ప్రచారాన్నీ, కమ్యూనిస్టుపార్టీ కార్యాలయాల ప్రకటనల్నీ పరిశీలించాలి.

ఇప్పుడు కమ్యూనిస్టుపార్టీపై నిషేధం హైదరాబాదులో మాత్రమే అమలులో ఉంది. మద్రాసు రాష్ట్రంలో గత సంవత్సరమే నిషేధం రద్దు గావించబడింది. హైదరాబాద్‌లో రజాకార్ సంస్థ దుష్పరిపాలన సమయంలో విజృంభించిన కమ్యూనిస్టు ఉద్యమం భారతసైన్యాల ఆక్రమణ అనంతరంకూడా కొనసాగింది. తెలంగాణాలో అప్పుడు చెలరేగిన అరాచకంవల్ల కర్షకులు భూముల నాక్రమించుకోడానికీ, కమ్యూనిస్టులు ఆయుధాలు సంపాదించడానికీ, వ్యక్తిగత హింసావిధానం అవలంబించడానికీ వీలు చిక్కింది. తరవాత భారత సైనిక పరిపాలన సుస్థిర పడకుండా చెయ్యడానికి కమ్యూనిస్టులు తెలంగాణాలో దౌర్జన్య చర్యలను మరింత హెచ్చించారు. కమ్యూనిస్టుల దౌర్జన్యాల నణచడానికి మిలిటరీ ప్రభుత్వం తనయావద్బలాన్నీ నల్లగొండ, వరంగల్ జిల్లాలపై కేంద్రీకరించగానే, కమ్యూనిస్టుపార్టీ తన దౌర్జన్య ఉద్యమాన్ని సమీపంలోని కొండప్రాంతానికీ, అటవీ ప్రాంతానికీ అక్కడనుంచి కర్నూలు, కృష్ణా ఉభయగోదావరి జిల్లాలలోకీ విస్తరింపచేసింది. తెలంగాణాలో కమ్యూనిస్టులు దౌర్జన్య చర్యలకు దిగడంతోపాటు, భూస్వాములను జాగీర్దార్లను తరిమివేసి వారి భూములను ఆక్రమించుకుని తమ పక్షానికి చెందిన చిన్న రైతులకు, వ్యవసాయ కూలీలకు పంచిపెట్టారు. ధనవంతులవద్ద ధనం దోచుకుని పార్టీనిధిని వృద్ధిపరుచుకున్నారు. అపారంగా ఆయుధాలు సంపాదించారు. తమ ఉద్యమాన్ని సర్కారుజిల్లాలకు వ్యాపింపచేయడానికి తెలంగాణాలో సంపాదించిన ఆయుధాలను వినియోగపరిచారు. కర్నూలు సర్కారుజిల్లాలలో భూముల ఆక్రమణకు అవకాశం లేకపోయింది. కాని దౌర్జన్యంవల్ల ప్రజలకు భీతి కలిగించి కాంగ్రెస్ వారినీ ధనవంతులనూ హింసించ నారంభించారు.

కమ్యూనిస్టుల దౌర్జన్యాల నణచడానికి ప్రభుత్వం పోలీసుబలాన్నీ, ప్రత్యేక పోలీసు దళాలనూ, సైనికబలాన్నీ ప్రయోగించింది. కమ్యూనిస్టులను అణచడంలో ప్రజలను కూడా పోలీసులు, ప్రభుత్వోద్యోగులు హింసించినమాట నిజమే. ప్రభుత్వాలూ, శత్రువర్గాలవారూ ప్రయోగించే బలాన్ని బట్టి, పరిపాలనావిధానంలో ప్రజలపట్ల ప్రభుత్వం అవలంబించే దండ

నీతినిబట్టీ, వాని హెచ్చుతగ్గుల్నిబట్టీ, కమ్యూనిస్టులు అవలంబించవలసిన దౌర్జన్య విధానం నిర్ణయించబడాలనే లెనిన్ సిద్ధాంతాన్ని కూడా తెలంగాణా కమ్యూనిస్టులు, ఆంధ్రకమ్యూనిస్టులు పాటించినట్లు కనబడదు. ప్రజల సంసిద్ధతనుబట్టీ, అవకాశాన్ని బట్టీ నిర్ణయించడానికి బదులు కమ్యూనిస్టులు ఇతర అంశాలను మాత్రమే ఆధారం తీసుకుని దౌర్జన్యానికి దిగారని పార్టీలోని జోషీవర్గం విమర్శించింది. ఈ కారణం వల్లనే అటు కమ్యూనిస్టులవల్లనూ, ఇటు పోలీసుల వల్లనూకూడా ప్రజలకు కష్టాలు సంభవించాయి. కమ్యూనిస్టులు ప్రయోగించిన బలంకంటె ప్రభుత్వం అధిక బలాన్ని ప్రయోగించవలసి రావడంతో రెండు పక్షాలమధ్యనూ పడి ప్రజలు నలిగిపోయారు.

ఇప్పటికైనా తమ తప్పిదాన్ని అంగీకరించాలని ప్రభుత్వం కమ్యూనిస్టులను కోరుతున్నది. కాని తెలంగాణా ఉద్యమాన్ని ఉపసంహరించడానికి పార్టీ ఆజ్ఞ ఇచ్చిందని మాత్రమే కేంద్రపార్టీ కార్యవర్గసభ్యుడు ఏ. కె. గోపాలన్ గారు చెప్తున్నారు. అటువంటి ఆజ్ఞ ఇచ్చినట్లు కేంద్ర పార్టీ ప్రకటించింది కూడా. అలా ఆజ్ఞ ఇచ్చే హక్కు వారికి లేదని కలకత్తా పార్టీ కేంద్రం ప్రకటించింది. దీనిని బట్టి వాస్తవంగా పార్టీ ఎటు నిర్ణయించినప్పటికీ. ప్రస్తుతావసరాల నిమిత్తమే ఉద్యమం ఉపసంహరిస్తున్నట్లు కమ్యూనిస్టు నాయకులు చెప్తున్నారుగాని, ఇదివరలో చేసినది తప్పిదమనే సంగతిని వారంగీకరించడం లేదు. ఒకవేళ వారలా అంగీకరిస్తున్నట్లు ఎవరైనా ప్రకటించినా నమ్మడం కష్టం. కమ్యూనిస్టుల ఉద్యమ విధానాన్ని బట్టి దౌర్జన్య చర్యలు అకాలంలో ప్రారంభిస్తే వ్యూహాంరీత్యా తప్పిద మౌతుందే గాని, దౌర్జన్య విధానం అనేది ఎప్పుడూ తప్పిదం కానేరదని వారి విశ్వాసం.

ఈనాడు ఎన్నికలకోసం వారు దౌర్జన్య విధానాన్ని విడనాడుతున్నట్లు చెప్పినా, నిజంగానే విడిచిపెట్టినా, కమ్యూనిస్టులలో హృదయపరివర్తన తేగలరని ప్రభుత్వం కాని నాయకులు కాని భావిస్తే అది భ్రమ మాత్రమే కాగలదు. ఈనాడు దౌర్జన్యం విడనాడినా, దౌర్జన్య చర్యలూ, సాయుధ విప్లవమూ, అంతర్యుద్ధమూ కమ్యూనిస్టు పార్టీ ఉద్యమంలో ప్రధాన పరికరాలనే మాటను ఎన్నడూ మరిచిపోకూడదు. కమ్యూనిస్టులలో హృదయ పరివర్తన తేగలరని భావించినా, ఆ అభిప్రాయాన్ని ప్రజలలో ప్రచారం చేసినా నిష్ప్రయోజన మౌతుంది. కమ్యూనిస్టు నాయకుల ప్రకటనల్ని నమ్మనవసరం లేదు. తెలంగాణాలో దౌర్జన్య చర్యల్ని ఉపసంహరించుకుంటారని వారు చెప్తే, ఎన్నికలకోసం ఆ మాటల్ని పాటించకూడదు. హైదరాబాద్‌లో వెల్లోడీ ప్రభుత్వం ఈ వాగ్దానాన్ని విశ్వసించలేదంటే అందులో వారి దోషం లేదు.

ఎన్నికలలో పాల్గొనడానికి తమకు తగినంత స్వేచ్ఛ, అవకాశం ఇవ్వడం లేదని కమ్యూనిస్టు నాయకులు ప్రచారం చేస్తున్నారు. స్వేచ్ఛగా ఎన్నికలు జరపడానికి ప్రభుత్వం ఎంత నిష్పక్షపాత బుద్ధితో కృషి చేస్తున్నదో ప్రజలకు తెలియక పోదు. కమ్యూనిస్టు లెంత ప్రచారం చేసినా ప్రజలు స్వానుభవం వల్లనే సత్యాన్ని గుర్తించగలరు. కమ్యూనిస్టుల ప్రచారం ఎటువంటిదో, ప్రచారంలో సత్యాసత్యాలెంతెంత ఉంటాయో ప్రజలకు తెలియక పోదు. నిర్బంధంలో ఉన్న కమ్యూనిస్టు నాయకుల్ని విడిచిపెట్టాలనీ, అజ్ఞాతవాసంలో ఉన్న నాయకులపైన వారంట్లు రద్దుపరచాలనీ, అప్పుడు కాని ఎన్నికలలో స్వేచ్ఛగా పాల్గొనడానికి వీలుండదనీ కమ్యూనిస్టుపార్టీ నాయకులు అంటున్నారు. తెలంగాణా ప్రాంతంనుంచి సైనికదళాల్ని, హోంగార్డ్సునీ తరలిస్తే కాని, నాయకుల్ని అందరినీ జైలునుంచి విడిచిపెడితేగాని, తెలంగాణాలో ఉద్యమాన్ని విరమింపచెయ్యడం సాధ్యపడదని గోపాలన్ గారంటున్నారు. దీనిని బట్టె వెల్లోడీ గారి వాదం స్పష్టపడుతోంది. దౌర్జన్యచర్యలకు పార్టీబాధ్యత వహిస్తున్నట్లు ఈ ప్రకటనవల్లనే ధృవపడుతోంది. రక్షకదళాల్ని తొలగిస్తే తెలంగాణాలో అశాంతి హెచ్చుమీరవచ్చును. అరాచక పరిస్థితులలో ఎన్నికలు స్వేచ్ఛగా ప్రజల అభిమతం ప్రకారం జరగలేవు.

హైదరాబాద్ ప్రభుత్వం ఈ షరతుల్ని నిరాకరించినందువల్ల గోపాలన్ గారు ఒక మెట్టు దిగివచ్చారు. నాయకుల్ని విడిచిపెట్టి వారంట్లు రద్దుపరిస్తే చాలునన్నారు. నిజానికి ఈ షరతులకు ఒప్పుకుని అందరినీ విడుదల చేసినప్పటికీ, ప్రభుత్వం నిష్పక్షపాతబుద్ధితో అన్ని పార్టీలకూ సమానావకాశాలిచ్చినప్పటికీ, కమ్యూనిస్టులు ఏవో దోషాలను ఆరోపించడం మానరని అందరికీ తెలిసినదే. ఎంత స్వేచ్ఛనిచ్చినప్పటికీ, చివరికి తమ ఓటమిని సమర్థించుకోలేక, తమకు సమానావకాశాలూ తగినంతస్వేచ్ఛా ఇవ్వలేదనే మాటను కమ్యూనిస్టులు మానరు.

## ఆంధ్రా క్రాస్‌వర్డ్సు

### రాజమండ్రి

### కీ సొల్యూషన్ నెం 1

**అడ్డము :** 1 అంగుళీయకము, 2 టపము, 3 కులాలుడు, 4 శమథము, 5 పబము, 6 సత్తి, 7 శిరస్త్రాణము, 8 ధరిత్రి, 9 వస్త్ర, 10 ఉచ్ఛ్రాయము, 12 కొండు, 13 ముల్లుకర్ర, 15 వుల్లి, 17 పష్టిక, 18 స్తబకము, 19 ముద్దియ.

**నిలువు :** 1 అంకుశము, 6 సముదయము, 8 ధ్వని, 9 పరీక్షుము, 10 ఉడుపు, 11 ముల్లు, 14 కలుషము, 16 బిస్త.

గెలిచినవారి పట్టీ, 11-11-51 వ తారీఖున పంపబడును.

### గమనిక

ఫజిల్ నెం 2 ముగింపు తేదీ 14-11-51 నిలువు 15 గురుత్వంతుడు. మూడవ ఫజిల్ 14-11-51 ఆంధ్రవారపత్రికలో చూడండి.

వాస్తవానికి కమ్యూనిస్టులకు గుణపాఠం చెప్పాలంటే ఈ ఎన్నికలే చక్కని తరుణమని చెప్పాలి. పార్టీపైన నిషేధాలను నిర్బంధాలను తొలగించి, (హైదరాబాద్‌లో కూడా) నిర్బంధంలో ఉంచబడిన నాయకుల్ని విడిచిపెట్టి, అజ్ఞాతవాసంలోని వారిపైన వారంటుల్ని రద్దుపరిచి ఎన్నికలలో పాల్గొనడానికి పూర్తియైన అవకాశమిస్తే, ప్రజలే పార్టీకి పాఠం చెప్పగలరు. ఇంకా జరుగుతున్న దౌర్జన్యాలకు రాజకీయ ప్రాధాన్యం ఇవ్వడం కంటె, దోషుల్ని సామాన్య నేరస్థులుగా శిక్షించాలి. ఇది మినహా, పార్టీని స్వేచ్ఛగా ఎన్నికలలో పాల్గొననిచ్చినట్లయితే, ప్రజలలో వారికెంత ప్రతిష్ఠ ఉన్నదో తేలిపోతుంది.

పార్టీ దౌర్జన్యాలపట్ల ప్రజలు విసిగిపోయారు. ఆంధ్రదేశంలో ప్రజాపార్టీతోనూ, తమిళనాడులో కేవలం కులద్వేషాలపైనే ఉద్యమం నడిపే ద్రావిడ కజగంతోనూ, కుమ్మక్కవుతున్న కమ్యూనిస్టుపార్టీ అవకాశవాదంపట్ల ప్రజలకు రోత కలుగుతోంది. ఈస్థితిలో మహావీరులవలె అజ్ఞాతవాసంలో ఉండి ప్రచారం చేస్తున్న నాయకుల్ని ప్రజల సన్నిధికి తేవడం అవసరం. పార్టీ చర్యలపట్ల ప్రజల అభిప్రాయాన్ని ప్రకటింపచెయ్యడం మేలు. ముస్లింలీగ్‌తో చేరి దేశవిభజనకూ అరాజకానికి తోడ్పడిన కమ్యూనిస్టులను ప్రజలు మరిచిపోరు. కాంగ్రెస్ జాతీయ సమరంలో ప్రభుత్వంతో చేరిన కమ్యూనిస్టుల్ని ప్రజలు మరిచిపోరు. ఎన్నికలలో పాల్గొనడానికి స్వేచ్ఛ నివ్వలేదనే మాటకు అవకాశమివ్వకుండా, పార్టీ నాయకుల అసలు రంగు బయటపెట్టడానికి ఇదే మంచి అదను.

# కాశ్మీర్ రాజ్యాంగ పరిషత్సభ

ముప్ఫైలక్షల కాశ్మీర్ ప్రజలచేత ఎన్నుకోబడిన కాశ్మీర్ రాజ్యాంగపరిషత్సభ ప్రారంభ సమావేశం అక్టోబరు 31 వ తేదీ బుధవారంనాడు శ్రీనగర్‌లో జరిగింది. ప్రజాస్వామ్య వ్యవస్థా స్థాపనకోసం సమావేశపరచబడిన ఈ సభపట్ల కాశ్మీర్ ప్రజలందరూ హర్షోత్సాహాలు ప్రకటించారు. బుధవారంనాడు కాశ్మీర్ దేశమంతా పండుగ జరుపుకుంది. ఇరవైయేళ్ళుగా కాశ్మీర్ జాతీయ మహాసభ జరిపిన ప్రజాస్వాతంత్ర్య పోరాటం ఫలించి ఈనాటికి రాజ్యాంగ పరిషత్సభగా రూపొందిందని కాశ్మీర్ ప్రజలు భావించారు.

తరుణంలో తన రాజ్యభవిష్యత్తును నిర్ణయించక, స్వతంత్రుడై పరిపాలించాలని కలలుకన్న మహారాజావల్లనే కాశ్మీర్‌లో యుద్ధం సంభవించింది. మహారాజా చివరకు పరిస్థితులకు లొంగి ప్రభుత్వాన్ని జాతీయనాయకులకు ఒప్పగించాడు.

భద్రతామండలి తమకు న్యాయం చేకూర్చగలదని ఆశపడిన భారతప్రభుత్వానికీ కాశ్మీర్ ప్రజలకీ ఆశాభంగమయింది. కాశ్మీర్‌పై జరిగిన దురాక్రమణను మండలి అరికట్టలేదు సరిగదా దురాక్రమణ పరులకు వారికి సంస్థానంలో స్థావరం చిక్కనిచ్చింది. భారత పాకిస్తాన్ దేశాలలో కాశ్మీర్ ఏ దేశంతో చేరాలో కాశ్మీర్ ప్రజలే ప్లెబిసైట్ ద్వారా నిర్ణయించాలనీ, ఆ నిర్ణయానికి కట్టుబడి ఉండగలరనీ మహారాజా అంగీకరించిన తరువాతనే భారతప్రభుత్వం దురాక్రమణ నిరోధానికి సైన్యాలను పంపింది. ప్లెబిసైట్‌కు కట్టుబడి ఉండగలరని భద్రతామండలికి



షేక్ అబ్దుల్లా

కూడా భారతప్రభుత్వం నివేదించింది. ఈనాటికీ ఆ మాటపైనే నిలబడిఉంది.

అయితే ప్లెబిసైట్ నిర్వహణకు తగిన పరిస్థితులను శాంతిని కాశ్మీర్‌లో స్థాపించడంలో భద్రతామండలికాని పాకిస్తాన్‌కాని సహాయపడ్డం లేదు. 'ఆజాద్ కాశ్మీర్' ప్రాంతంలో పాకిస్తాన్ నిర్మించిన 'ఆజాద్ కాశ్మీర్' సైన్యాలను నిరాయుధం చెయ్యనిదే ప్లెబిసైట్ సక్రమంగా నిర్వహించడం అసంభవం. అదీకాక భారత సైన్యాలు కాశ్మీర్‌నుంచి తరలిపోగానే తిరిగి దురాక్రమణ జరగదనే రూఢిలేదు. ఈ అంశాలను గమనించడానికి నిరాకరిస్తూ, బేషరతుగా భారత సైన్యాలు తరలిపోవాలని పాకిస్తాన్ చేస్తున్న వాదాన్ని భద్రతామండలి బలపరుస్తోంది.

అందువల్లనే కాశ్మీర్ కమిషన్‌కాని, సర్ ఓవెన్ డిక్సన్‌కాని, డా॥ ఫ్రాంక్ గ్రాహంకాని సైనికోపసంహరణ విషయమై పాకిస్తాన్ భారతదేశాల మధ్య ఒప్పందం సాధించలేకపోయినారు. అందువల్లనే తమ న్యాయవిహితమైన

(48-వ పేజీ చూడుడు)

# కౌంట్ ఆఫ్ మాంటీ క్రిస్టో

అలెగ్జాండర్ డ్యూమా

## 72

నయర్ టైర్ కబురు పంపినందుకు మాక్సిమిలియన్ మారెల్ పరమానందభరితుడైనాడు. వెనుక ద్వారంగుండా నయర్ టైర్ నివాసం ప్రవేశించాడు. వెనుకనే బారోయ్ ద్వారం బంధించాడు. వాలంటిన్ అతని దృష్టికి అపురూప సుందరిగా కనపడింది. వృద్ధుడు నేత్రాలతోనే యువకుని ఆహ్వానించాడు.

వాలంటిన్ వృద్ధుని సమీపించి ఇలా అంది: "మీరు నాతో చెప్పినదంతా మారెల్ కి తెలియపరచనా ?"

తెలియపరచమన్నట్లు వృద్ధుడు చూశాడు. వాలంటిన్ మారెల్ వంక తిరిగి "నీతో కొన్ని ముఖ్యవిషయాలు చెప్పాలని మా తాతగారు చెప్పారు" అంది.

"ఏమిటవి ? అన్నాడు మారెల్ ఆత్రుతతో.

"మా తాతగారీయిల్లువిడిచి వెళ్లిపోవా లనుకుంటున్నారు. బారోయ్ తగిన యింటికోసం వెతుకుతున్నాడు."

"మరి నువ్వు ఆయనవద్ద లేకపోతే సంరక్షణచేసే దెవరు ?" అన్నాడు మాక్సిమిలియన్ మారెల్.

"నేనా ? నేను నా తాతగారిని విడిచిపెట్టి ఉండను. ఇందుకు నా తండ్రిగా రంగీకరించకపోతే, యుక్తవయస్సు (మెజారిటీ) వచ్చేవరకూ ఊరుకుంటాను. పది మాసాల్లో నాకు మైనారిటీ తీరిపోతుంది. ఆ తరవాతనే తాతగారివద్ద చేరతాను. అప్పుడు నువ్వు మాయింటికి రావచ్చును. మ నిద్దరి వివాహానికీ ఆటంకం ఉండదు. అంతవరకూ మనిద్దరం దూరంగానే ఉండవలసి వస్తుంది."

మారెల్ క్షణం ఆలోచించాడు. వృద్ధునివంక తిరిగి "మీరు చెప్పిన మాటల్ని అక్షరాలా శిరసావహిస్తాను" అన్నాడు.

వృద్ధుని నేత్రాలలో ప్రేమ కరుణ వెల్లువికినాయి. కుటుంబ విషయాలన్నీ తెలిసిన బారోయ్ యువతీ యువకులవంక ప్రేమార్ద్ర దృష్టులు సారించాడు. వాలంటిన్ అతన్ని చూసింది. వృద్ధుని ప్రాణంవలె కాపాడుతున్న పరిచారకునిపట్ల కృతజ్ఞతతో, "బారోయ్ ! నువ్వు అలసిపోయినట్లున్నావు. ఈ నారింజ రసం తీసుకో" అంది. బారోయ్ అత్యంత సంతృప్తితో గ్లాసు అందుకుని "నిజంగా ఇందాకటినుంచి నాలుక ఎండుకుపోతున్నదమ్మా" అన్నాడు. ప్రక్క వరండాలోకి వెళ్ళి ఒక్క గుక్కలో గ్లాసు ఖాళీ చేశాడు.

ఇంతలో మైసావడిలో ఎవరివో మాటలు వినవచ్చాయి. "డాక్టరు కాబోలు. వచ్చేవేళయింది కదూ ?" అంది వాలంటిన్. మారెల్ వంక తిరిగి "ఇంక నువ్వు వెళ్లిపోవాలి. బారోయ్ నీకు వెనుక దారిచూపుతాడు" అంది. బారోయ్ ని పిలిచింది. అతను నిలవలేక తూలిపోతూ వచ్చాడు.

"అదేమిటి బారోయ్ ?" అంది వాలంటిన్.

బారోయ్ నిలవలేక వృద్ధునిపాదాలవద్ద గుబాలున కూలిపోయాడు. ముచ్చెమటలు పోశాయి. "అదేమో నాకు తెలియడంలేదండి" అన్నాడు వొణికిపోతూ. "ఏదో చెప్పలేని బాధ పుట్టింది. కడుపులో తిప్పివేస్తోంది. సత్తువలేదు. కన్నులు చీకట్లు కమ్ముతున్నాయి. ఏమీ కనపడ్డంలేదు." తరవాత అతని నోట మాట పెగిలి రాలేదు. స్పృహతప్పిపోయింది.

బారోయ్ కూలిపోయిన ధ్వని విని విల్ ఫర్ట్ లో గుమ్మంలోనుంచి గబగబ వచ్చాడు. మారెల్ వెంటనే ఒకమూల తెరలచాటున దాగాడు. పరిచారకుని చూసి విల్ ఫర్ట్ విభ్రాంతుడైనాడు. వృద్ధుని నేత్రాలలో భీతి, దుఃఖం పొడచూపినాయి. "డాక్టర్ ! డాక్టర్ !" అంటూ విల్ ఫర్ట్ కేకలువెయ్య నారంభించాడు. హిలాయిస్ విల్ ఫర్ట్ సావధానంగా మేడమెట్లు దిగివచ్చింది. "ఏమిటది ? ఏం జరిగింది ?" అంది.

"డాక్టరెక్కడ ? ఇప్పుడే నీతో మాట్లాడుతున్నారుకదా ! ఎక్కడున్నారు ?" అన్నాడు విల్ ఫర్ట్ ఆందోళనతో.

హిలాయిస్ విల్ ఫర్ట్ భర్త మాటలు వినిపించుకోకుండా వాలంటిన్ తో "ఏదైనా తిన్నాడా !" అంది.

"లేదు, ఈపూట ఇంకా భోజనమైనా చెయ్యలేదు. తాతగారి కోసం ఉంచిన నారింజ రసం నేనే అతని కిచ్చాను."

హిలాయిస్ విల్ ఫర్ట్ ఉలిక్కిపడింది. వృద్ధుడామెను తదేకంగా పరీక్షిస్తున్నాడు.

"డాక్టరెక్కడున్నారు ?" అని మళ్లీ అడిగాడు విల్ ఫర్ట్.

"ఎడ్వర్డ్ ని పరీక్ష చేస్తున్నారు."

విల్ ఫర్ట్ పరుగు పరుగున మేడమెట్లెక్కాడు.

"ఇప్పుడితనికి వెత్తురోడ్చాలి కాబోలు. నేను నెత్తురు చూడలేను. వెళ్ళిపోతున్నాను" అంటూ హిలాయిస్ విల్ ఫర్ట్ భర్త ననుసరించింది.

మారెల్ తెరలచాటునుంచి వచ్చాడు. వచ్చినవెంటనే వాలంటిన్ తో చెప్పి వెనుక ద్వారంగుండా వెళ్లిపోయాడు.

వెంటనే విల్ ఫర్ట్ వైద్యుని వెంటబెట్టుకుని వచ్చాడు. వైద్యుడు రోగి ముఖాన్ని చూశాడు. "కర్పూర తైలం తెప్పించండి. అందరూ ఇక్కడనించి వెళ్ళిపోవడం మంచిది" అన్నాడు. వాలంటిన్ తెల్లబోయింది. ఆమె మెల్లిగా గదివిడిచి వెళ్ళిపోగానే డాక్టరు తలుపుమూసి వచ్చాడు.

"ఈపూట ఆహార మేదైనా తీసుకున్నాడా ?" అని అడిగాడు.

"నారింజరసం మాత్రం తీసుకున్నాడట" అన్నాడు విల్ ఫర్ట్.

"గ్లాసెక్కడుంది ?"

వృద్ధుడు వరండావైపు చూశాడు. డాక్టరు గబగబ వరండాలోకి వెళ్లాడు. అప్పుడే హిలాయిస్ విల్ ఫర్ట్ ఆ ప్రక్కకు రావడం అతను గమనించలేదు. వరండా చివర గూటిలోనున్న గ్లాసు తీసుకున్నాడు. గ్లాసులో అడుగున కొద్దిగా రసం మిగిలి ఉంది. గ్లాసు తీసుకుని మళ్లీ గదిలోకి వచ్చాడు. చేత కొన్ని చుక్కలు రసం పోసుకొని నాలుకచాపి రుచి చూశాడు. వెంటనే ఉమ్మివేసి పెదవులూ నాలుకా తుడుచుకున్నాడు.

చిత్రం: సీతారామ్

వికృత ముఖభంగిమతో "అదే!" అన్నాడు.

"ఏది?" అన్నాడు విల్‌ఫర్డ్.

డాక్టర్ సమాధాన మివ్వలేదు. వృద్ధునివంక తిరిగి "మీరు కూడా ఈ రసం తీసుకున్నారా?" అని అడిగాడు.

"అవును" అన్నాయి వృద్ధుని నేత్రాలు.

"చేదుగా ఉంది కాదూ?"

"అవును."

బారోయికి స్పృహవచ్చింది. డాక్టరును చూసి "అయ్యో! నేను చచ్చిపోతున్నాను బాబూ. నన్ను రక్షించలేరూ?" అని దీనంగా ప్రార్థించాడు.

"కర్పూరతైలం ఏదీ?" అన్నాడు డాక్టరు. విల్‌ఫర్డ్ పరిచారకులకోసం బిగ్గరగా అరిచాడు. ఇల్లంతా ప్రతిధ్వనించింది. కాని సమాధానం రాలేదు. విల్‌ఫర్డ్ సావడిలోకి పరుగు తీశాడు.

తిరిగి బారోయికి మూర్ఛవచ్చింది. డాక్టర్ ఇంక లాభం లేదని భావించి పరిచారకుని విడిచి యజమానిని సమీపించాడు.

"మీ కెలా ఉంది? బాధ లేదా?" అని అడిగాడు.

"లేదు" అన్నాయి వృద్ధుని నేత్రాలు.

"నారింజ రసాన్ని మీ కెవ రిచ్చారు? బారోయ్ కాదూ?"

"కాదు"

"వాలంటిన్ ఇచ్చిందా?"

"అవును."

"బారోయ్‌కి రసాన్ని ఇచ్చింది ఆమేనా?"

"అవును."

విల్‌ఫర్ట్ తైలం తీసుకుని వచ్చాడు.

"ఇంకిప్పుడు లాభంలేదు. అతని ప్రాణాలు అంతరించాయి" అన్నాడు డాక్టరు. విల్‌ఫర్ట్ నిశ్చేష్టుడైనాడు. వృద్ధుని వంక చూశాడు. వృద్ధునిముఖంలో ఆందోళన వ్యక్తమౌతోంది. ఎవరికోసమో ద్వారంవంక చూస్తున్నాడు.

"వాలంటినని మీ వద్దకు పంపమంటారా?" అన్నాడు. వృద్ధుడు వెంటనే సమ్మతి సూచించాడు. వాలంటిన్‌తో చెప్పి విల్‌ఫర్ట్ తిరిగి వచ్చాడు.

"మీతో మాట్లాడాలి" అన్నాడు డాక్టరు విల్‌ఫర్ట్‌తో.

ఇద్దరూ కలిసి సావడిలోకి వెళ్లారు.

కన్నుమూసి తెరిచేటంతలో ప్రాణా లంతరించాయి!" అన్నాడు విల్‌ఫర్ట్.

"అవును" అన్నాడు డాక్టరు. "కాని ఇందులో ఆశ్చర్యం ఏముంది? మీ మామగారు అత్తగారు కూడా చనిపోయేముందు అట్టే సేపు బాధపడలేదు."

విల్‌ఫర్ట్ ఉలిక్కిపడ్డాడు "ఏమిటి! ఇంకా మీ కదే అనుమానమా?"

"అనుమానమా! ఇంక నాకు అనుమానం లేదు. అదే. నేను చెప్పేది సావధానంగా వినండి. ఈవిషం ప్రయోగిస్తే విషప్రయోగపు చిహ్నాలైనా లేకుండా మనిషి చచ్చిపోతాడు. మీ మామగారినీ, అత్తగారినీ ఏవిషం అంతమొందించిందో అదే విషం బారోయ్‌ప్రాణాలు కూడా తీసింది. ఇదిగో ఈ సీసాలో ఇప్పలా తేనె ఉంది చూడండి. గ్లాసులో మిగిలిన ఈ నారింజ రసం రెండు చుక్కలు తేనెలో పోస్తాను. నారింజరసం పరిశుద్ధమైనదైతే తేనెరంగు మారదు. విషం కలిసినట్లయితే తేనె ఆకుపచ్చగా మారిపోతుంది చూడండి" అంటూ డాక్టరు సీసాలో రెండుచుక్కలు నారింజరసం పోశాడు. తేనె పైభాగం ఆకుపచ్చని రంగుకు మారింది. క్రమక్రమంగా అది కిందకు దిగి తేనె అంతా రంగు మారిపోయింది.

"బారోయ్ విషప్రయోగంవల్ల చనిపోయాడు. ఈ సత్యాన్ని భగవంతుని సమక్షంలో కాని మానవుని సమక్షంలో కాని నిరాక్షేపణగా నిరూపించగలను.

విల్‌ఫర్ట్ తల పట్టుకున్నాడు. నిలబడలేక ప్రక్కనున్న ఒక కుర్చీలోకి వాలిపోయాడు.

"అయ్యో! నా యింటిని మృత్యుదేవత ఆవహించింది" అని విల్‌ఫర్ట్ వాపోయాడు.

"కాదు. హంతకుడు ఆవహించాడు" అన్నాడు డాక్టరు. "మీ యింటిలో ఎవరో ఘోర దురంతాలకు ఒడిగట్టారు."

విల్‌ఫర్ట్ నిస్సహాయ భావంతో చేతులెత్తి జోడించి శిరస్సు వొంచుకున్నాడు.

"అలా నిరీహతో ఊరుకుంటే లాభంలేదు. ఈ హత్యలవల్ల ఎవరికి లబ్ధి కలుగుతుందో ఆలోచించండి. హంతకు డెవరో తెలుస్తుంది."

"ఏం చెయ్యను? ఏం చెయ్యగలను?"

"ఆలోచించండి. సెంట్ మీరాన్ దంపతులు, నయర్‌టైర్..."

"నయర్‌టైర్? అంటే?"

"అవును. బారోయ్ ప్రాణాలు తియ్యడం ఎవరి కవసరం? ఆ విషయం నయర్‌టైర్ కోసం రసంలో కలపబడింది."

"అయితే నా తండ్రి కెందుకు ప్రమాదం కలగలేదు?"

ఈ విష పదార్థాన్ని కొద్ది కొద్దిగా ఆయనకి ఇస్తూవచ్చాను. ఆయన జబ్బుకి ఇది మంచి మందు, ముందు కొద్దిగా ఇచ్చి క్రమంగా అలవాటుచేస్తే ఈ విషం ప్రాణానికి ముప్పుకాదు."

"అయ్యయ్యో!"

సెంట్‌మీరాన్ దంపతులు నయర్‌టైర్ చనిపోతే ఎవరికి లబ్ధి కలుగుతుంది?"

విల్‌ఫర్ట్ జవాబివ్వలేదు.

"నయర్‌టైర్ తన సొత్తు నంతటినీ మీకుగాని మీ బిడ్డలకుగాని ఇవ్వకుండా దానంచేస్తూ మరణశాసనం వ్రాశారు కాదూ? తరవాత దానిని రద్దుపరిచి మొన్న నే మరొకటి వ్రాశారు కాదూ? తిరిగి వృద్ధుడు మనస్సు మార్చుకునేలోగా ప్రాణాలు తీసెయ్యడం ఎవరికి లాభం?"

"అయ్యయ్యో! నా బిడ్డని కనికరించండి."

"మాశారా! మీరే మొదట ఆమె పేరు ఉచ్చరించారు. మీరే! ఆమె తండ్రే!"

"వాలంటిన్! ఆమె అటువంటి పని చెయ్యగలదా? అసంభవం. ఆమె అంతఃకరణ అతి నిర్మలమైనది. నేనైనా దురంతానికి ఒడబడాలికాని ఆమెచేత అటువంటిది జరగదు. మీరు వాలంటిన్ సంగతి తెలుసుకుంటూ ఆమెను కరుణించండి."

"కరుణ కిక్కడ చోటులేదు. మీ మామగారికి మందులు బంగీకట్టి పంపినది వాలంటిన్. మీ అత్తగారికి మందుకలిపి ఇచ్చినది వాలంటిన్. మీ తండ్రికి నారింజరసం ఇచ్చినది వాలంటిన్ మీ యింటిలో మృత్యువులకు కారణం వాలంటిన్ విషప్రయోగం.

(47-వ పేజీ చూడండి)

# అబ్బాయి చదువు

## శ్రీ యం. సీతారామయ్య

"అయితే ఏమిట్రా నువ్వనేది? నేను ఏనాడు హరీ అంటానో, అఖండంగా దేశం కాని దేశంలో చదివించాలంటే నే నేం జమీందారునా నువ్వే ఆలోచించు? చిన్నదాన్ని ఓ అయ్య చేతులో పెట్టాలా? అన్నీ ఆలోచించుకు ఇక్కడే బి. యే లో చేరరా సత్యం. ఏదో మా కళ్ళ ఎదట పడుంటావు" అన్నాడు రామయ్య.

"మీరు చెప్పింది కాదనటం లేదు నాన్నా. ఆమాత్రం ఆలోచించ లేదనా నేను మాత్రం? ఈనాటిచదువులుసంపాద్యం కోసమేనని మీకు తెలుసుగా? బి. యే. చదివి ఏమి చేస్తేది? మూడేళ్లూ చదివితే కనీసం రెండొందలన్నా చేతిలో పడ్తాయి కదా? ఇంతకంటే నేనుమాత్రం ఏమనేది?" అన్నాడు సత్యం జాలిముఖంతో.

"ఆ, మహా సంపాయించేస్తావు చదివి. మెట్రిక్యులేషన్ చదివి సంపాయిస్తున్నారు. అదృష్టముండాలే గాని..."

అలా అనకండి నాన్నా. ఎవరో నూటికి కోటికి అంత అదృష్టవంతులు. నా జీవితమంతా ఈ చదువుమీద ఆధారపడిఉంటుందని మీకు మాత్రం తెలియదూ? ఎవరు శాశ్వతం చెప్పండి. ఒక్క ఎకరా అమ్మితే చాలు గదా? ఒక్కగాని ఒక్క కొడుకును. ఎనిమి దెకరాల్లో నాకోసం ఒక్క ఎకరా..." సత్యం ఎంత దీనంగా అడిగాడంటే సుందరమ్మ ఏడ్చింది సరికదా, రామయ్య కళ్ళలోగూడా నీళ్లు తిరిగాయి.

"సరే కానీ, మాద్దాం, లే భోజనానికి వెడదాం" అంటూ లోపలి కెళ్లిపోయాడు.

* * *

"ఇంతకీ అబ్బాయి చదువుతాననటం డాక్టరీ చదువా, ఇంజనీరుచదువాండీ" అని అడిగింది సుందరమ్మ భర్తకు తమలపాకులు చీల్చి ఇస్తూ.

"ఆ, ఎత్తుబారం చదువు. వాటిలో వీడికి సీటెవరిస్తారు. ఏదో బి. కాం అంటున్నాడు. బేంకీలో ఉద్యోగం దొరుకుతుంది, వందో మరో పాతికో జీతంతో" అన్నాడు రామయ్య విసుగ్గా.

"బాంకీలోనా? నూరేమి ఖర్మమండీ! సూరి మొగుడు యఫ్. ఏ. తప్పాడుట. ఐదొందల జీతం ఇస్తుంటేను" అంది సుందరమ్మ.

"కాలం మారిందే, ఆనాడు యఫ్-ఏ ఈనాటి యమ్. ఏ కంటేకష్టంగా ఉండేది. ఇప్పుడు వీడి చదువు మూడేండ్లుట. ఎక్కడ తెచ్చేది, కనీసం మూడన్నది మూడున్నర వేలన్నా అవుతుందికదా?"

"ఆచిన్నదాని పెండ్లికని ఐదు వేలు దాచారుగా? పోనీ ప్రస్తుతం అందులోంచి ఓ రెండు వేలు తీయరాదూ?"

"అంకొకటి దొరికింది నీకు మాట్లాడితే. దాన్నేం దీపపు సెమ్మెలాగు పంపుతావా అత్తారింటికి? చాల్తుందో చాలదో అని నేనఘోరిస్తోంటే నీదో సోద."

"సరే వాడన్నట్లు కలకాలంచదివించరు గదా. ఎలాగో అప్పులన్నీ తీర్చారు. పోనీ అనల్లమానుచేనులో ఓ ఎకరాఅమ్మరాదూ..."

"నీకూ ఆ బుద్ధే పుట్టింది? సరే కానీ చూతాం..."

* * * *

ఒకమాటు 'ఊఁ' అన్న తర్వాత ఇంతవరకూ బ్రహ్మరుద్రాదు లొచ్చినా మాట తప్పి ఎరుగడు రామయ్య. దేశం కాని దేశం (వాళ్ల మనసులో) పోతున్నాడని, సూది దగ్గరనుంచి, సున్నం వరకు సమస్తం కొన్నాడు. అడిగినదానికంటే రెండు జతలెక్కువగానే కుట్టించాడు గుడ్డలు.

సుందరమ్మ మాత్రం ఊరుకుందా? పెట్టెడు పిండివంటలు, బుట్టెడు ఊరగాయలు చేసి ఇచ్చింది. "ఫస్టుక్లాసులో పాసయి రానాయనా" అని ఒక కంటిలో దుఃఖబాష్పాలు మరొకంటిలో ఆనంద బాష్పాలతో దీవించిందావిడ కొడుకుని. సత్యానికి కూడా, ఏదో బంధాల్లోనుంచి తెంచేసినట్లనిపించింది.

విశాఖపట్నంలో వెలలు మండిపోతున్నాయని విన్నాడు రామయ్య. అసలు సత్యం అడిగిందల్లా, హాస్టలు డబ్బుపోను పదిరూపాయలు పైకర్చుకు. కాని రామయ్య మొదటినెల కదా అని అరవంద చేతిలో ఉంచాడు. సత్యానికి చాల ఆశ్చర్యమేసింది. ఇందులో అసమం, ఓ నలభై ఐనా చాలనుకున్నాడు.

* * * *

కాలేజీలో అడుగు పెట్టగానే అదో విధమైన ఆనందం, ఊరు విడిచినందుకు ఆరాటం పట్టుకున్నాయి సత్యానికి. హాయిగా ఊరికి రెండుమైళ్లదూరాన కొండ మీద బ్రహ్మాండమైన కాలేజీ కట్టడాలూ, అడవి, మూడంతస్థుల హాస్టలు, మూడు ప్రక్కలా సముద్రం అంతా స్వర్గంలాగు కనిపించింది వాడికి. విద్యార్థి కిచ్చే మర్యాద అతనికెంతో ఆనందంగా ఉంది.

కాని పైకి పటారం లోపల లొటారం అన్నట్లు హాస్టలు భోజనం చేసేసరికి అతనికి నరకబాధ పడ్డట్లనిపించింది. ఇంట్లో పాతర పెట్టిన మొలగొలుకులు వరకు పంపి పువ్వులాగు వండి, కమ్మటి పాధకాలతో ఘుమ్మని నేతితో భోంచేసే ఒక వ్యక్తికి, మట్టిబెడ్డల అన్నంలో, రుచీపచీ లేని సాధకాలతో డాల్డా నేతితో భోంచేసే దానికన్న ఏం శిక్ష కావాలి? కాని రెండు మూడు రోజులలో అలవాటైంది. అందుకే అన్నారు పెద్దలు 'తినగ తినగ వేము తియ్యనుండు' అని. కాని ఎటొచ్చీ చదువు కోసం వచ్చిన తను భోజనానికి అంత ప్రాముఖ్యం ఇవ్వకూడదనుకున్నాడు.

కాలేజీ తీసేవరకు అక్కడ లెక్చరర్లంటే ఎంత భయంకరంగా ఉంటారో అనిపించింది సత్యానికి. కాని మొదటి రోజే తెలిసిపోయింది సత్యానికి, తన సీనియర్ల మాటలు నిజమేనని. నిజంగావారెంతో మంచివాళ్లుగా కనిపించారు వీడికి. వారూ ఒకనాటి విద్యార్థులేగా? అందరూ కూడా

"చదువు ఎలాగుంటుంది? ఏ ఏ ఘట్టాలు పరీక్షకోసం ప్రాముఖ్యం ఇవ్వాలి? జీవితాంతం వరకు ఉపయోగించాలంటే ఎలా చదవాలి?" ఇలాంటి అమూల్య సంగతులను గురించి అరటిపం డొలిచి పెట్టినట్లు చెప్పారు. అన్నీ నచ్చాయి సత్యానికి. తను అలాగే చదవాలనుకున్నాడు. అందరు చెప్పిన పుస్తకాలన్నీ కొన్నాడు మొదటి సంవత్సరమే వంద రూపాయలకు. మొదట పెట్టింది ఇంతా నాలుగు సబ్జక్టులు. తను ముందడుగు వేశాడు చదువులో. తండ్రి తనను ఎంత బాధతో చదువుకు పంపింది, తను తల్లికిచేసిన వాగ్దానం మనసులో ఉంచుకుని మరీ చదివాడు. సత్యం చూపే శ్రద్ధచూసి ఫస్ట్ క్లాసు వస్తుందని నమ్మారు లెక్చరర్లుకూడా! మొదట మూడు నెలలూ దీపంలా వెలిగాడు క్లాసులో. ఒక్క సినిమా ఐనా చూడలేదు. ఒక్కటే డబ్బు గూడా దండుగ లేదని మురిసిపోయారా ముసలిదంపతులు మార్కులు చూసి..

*　　*　　*　　*

"ఏరా సత్యం, మరీ చదలపురుగయి తినేస్తున్నావు పుస్తకాలను. సినిమాకు రాపోదాం" అంటూ వచ్చాడు గోపాలం, సత్యం రూములోకి.

"ఆ, ఏం సినిమాలురా, నా కిష్టంలేదు నీవు పోదూ..."

"ఓయబ్బ, ఇంతట్లోకే ఆ వొచ్చే కాసు రానందు లేవోయ్" నిజానికి ఈ మూడు నెలలనుంచీ ఒకేచోట ఉన్నా ఈ క్షణం వరకూ నోరువిప్పి మాటలాడలేదు గోపాలం వీడితో. ఇంతకుముందుకూడా ఇద్దరూ క్లాసు మేట్సే!

"ఎందుకురా? రెండు రూపాయలు మూడుగంటలు దండుగ చేసుకుని పోగొట్టుకోవా లీ కండ్లు? కొంచెం మిరపగింజ..."

"ఓరి, ఏం మనిషివిరా? రెండు రూపాయలకోసం చూస్తున్నావుటరా? నే పెట్తా రారా." తలకొట్టేసినట్లయింది సత్యానికి. అప్పటికి తనేం అంత లేనివాడు, గోపాలం కోటికిపడగెత్తినవాడా? గట్టిగాబుద్ధిచెప్పాలనుకున్నాడు. కాలేజివద్ద బండెక్కినప్పటినుంచి తిరిగి కాలేజీ ఆవరణలో అడుపెట్టేవరకూ అయిన అయిదు రూపాయలా ఆరణాలు సత్యానివే! బాగా బుద్ధి చెప్పాననుకున్నాడే కాని గోపాలం కోరింది కూడా ఇదే నని వాడికేం తెలుసు?

రూముకొచ్చిన తర్వాత ఆలోచనలో పడ్డాడు సత్యం. "ఒక్కరోజు వెధవసినిమాకోసం ఐదు రూపాయల ఆరణాలు ఖర్చా? తన తండ్రి జమీందారా? తను ధనవంతుడి ననిపించుకోవాలనేగా ఇంత కష్టపడింది? ఎందుకీ మీసాలమీద సంపెంగనూనె! ఏమైనా సరే ఇక సినిమాలకే వెళ్ళకూడదని నిశ్చయించుకున్నాడు.

కాని సాఫీగా నడిచే బండి ఓ మాటు పట్టాతప్పిన తరవాత ఏమనుకుని ఏంలాభం? వారం జరిగిందో లేదో 'హామ్లెట్' వచ్చింది. సరదాగా వెడదామంటే వెడదామన్నారు.

ఈమాటు గోపాలం, ఇంకా నలుగురు క్లాసుమేట్సువచ్చారు సత్యాన్ని పిలిచేందుకు. ససేమిరా రానన్నాడు.

'ఎందుకు రావు?"

'నాకిష్టంలేదు. తలనొప్పిగా కూడా ఉంది'

'మళ్ళీ మళ్ళీ రాదురా సత్యం. చాలా గొప్ప చిత్రం' ఎంతో మంచిగా అన్నాడు గోపాలం.

"అబ్బబ్బ. చేతులో కాసు లేదురా? నన్నెందుకు బాధిస్తారు? ఉంది కాని వెళ్ళకూడదనే ఈ మాటన్నాడు గోపాలం.

"అంతగా లేకపోతే నే నిస్తాలేరా? ఎంత కావాలి? నీకు వీలైనప్పుడే ఇద్దూ కాని" గోపాలం భాగ్యవంతుడే కాని వెర్రివేషాలకు పోయేరకం మాత్రం కాదు. "మీ ఇంటి కొస్తే ఏమిస్తారు, మా ఇంటి కొస్తే ఏం తెస్తారు అనే రకమే!"

ఎంతో బాధపడ్డాడు సత్యం. తను ఆ రోజు ఐదు రూపాయలకు పైగా క్షవరం చేసుకుంటే ఈనాడు వాడు ముఖమాటం



లేకుండా చెప్పేశాడు. పోగూడదని చాల ప్రయత్నించాడు. కాని కని పడితే ఏమౌంట్లే, నేను కలకాలం కట్టే రకం, అన్నట్టుగా గోపాలం మాట్లాడేసరికి షాక తప్పింది కాదు.

అప్పటినుంచీ, కొంచెం సినీమాలకు పోవటం అలవాటయింది సత్యానికి. అంతే కాదు ఓ సినీమానుంచి వచ్చిన తర్వాత మళ్ళీ సినిమా చూసేవరకు, చూచినదాని మీద చర్చలు అతి చురుకుగా సాగేవి.

*　　*　　*

"అయితే అమ్మాయ్ సుందరం, సత్తిగాడెప్పుడొస్తాడే ఆర్నెల్ల సెలవులకు?" సత్యాన్ని చూడాలని వచ్చిన సుబ్బమ్మ అడిగింది చెల్లెల్ని.

"రావాలే వారం రోజుల లోపలే"

"ఇంతకూ వాడేమిటే చదవటం"

"అదేదో ఆ నర్సుటచే — పాసుకాగానే అధమం మూడొందల జీతమున్నా దొరుకుతుందన్నారు నాయన" అంది సుందరమ్మ.

"మూడొందల జీతమే. నెలకే?"

"కాక సంవత్సరానికటే. వాడికేమి అక్కయ్యా. సుబ్బశాస్త్రి చెప్పనే చెప్పాడు చేయిచూసి భోగపురుషుడమ్మా నీకొడుకు కారులో తప్ప కదలడని..."

"అన్నట్టు వదిన గారొచ్చి వరోజే అయ్యింది ఈ త్తరం కూడా వొచ్చింది. బుధవారం నాలుగుగంటల బండిలో వస్తాట్ట" అంటూ వచ్చాడు రామయ్య.

"అలాగా, చేతిలో ఉందో లేదో ఓ పాతికేనా పంపండి ఖర్చీకి."

"నీకే కాడుకొడుకు. ఈ ఆరునెల్లకే ఓ పెద్ద మొత్తం పూర్తయింది. వెళ్ళేరోజేమో సంవత్సరానికి వెయ్యి ఎల్లికొల్ల అన్నాడు. పోనీ పాపం దూర దేశాన ఉన్నాడు గదా అని పంపుతోంటే సిసిఖర్చులుకూడా ఎందుకూ అంటు?"

"అయ్యో అలా అంటారేమండీ. సముద్రంలో దిగి లోతెక్కువనుకుంటే ఏం లాభం?...

"నీతకొలు చాలుగాని, వాడొచ్చేసరికి కొంచెం కోవా జిలేబి....."

"మీరు చెప్పాలటండీ. నాయనకే ఇష్టమో కాదు తెలియదూ..."

*　　*　　*

"ఏరా నాయనా ఇలా చిక్కిపోయావు మరీని. దబ్బనంలా పోయి సూదిలా తేలావు?" అంది సుందరమ్మ కొడుకుతో.

"ఏముందమ్మా, ఒక్కపూట తిండి. అది ఎద్దులకు వేసే గుగ్గిళ్ళలా ఉంటుంది."

"అంత దూరాన ఎందుకు చేరావురా నాయనా? పట్నంలో అన్నయ్య దగ్గరకేనా రాకుండాను" అంది సుబ్బమ్మ.

"అన్నట్టు అమ్మా నువ్వెప్పుడొచ్చావ్? అన్నయ్య బాగున్నాడా?"

"అంతా బాగున్నారు. నిన్నోమాటు చూసిపోదామని మొన్న గురువారం వచ్చాను. సరే ఇక లే, ఎప్పుడు రెండు మెతుకులు కొరికావో, ఫలహారం చేద్దూగాని. అమ్మాయి చేసిన పులుసటుకులు పట్రావే. వాడికి ఎంతో ఇష్టం."

"ఏమైనా పుస్తకాలు తెచ్చుకున్నావుట్రా చదువుకుందుకు?" అన్నాడు రామయ్య కొడుకు శ్రద్ధ చూదామని.

"ఓ, ఎందుకు తెచ్చుకోను నాన్నా? పుస్తకాలు పెట్టెడు తెచ్చాను కాని ఒక్కటేనా ముట్టలేకపోయాను సెలవల్లో."

సత్యం చాలా చిక్కిపోయాడని అంతా చాల బాధపడ్డారు. "ఎటొచ్చీ ఎవరైపంపుతూనే ఉన్నారుకదా — మరో పదో పాతికో చేసి అక్కయ్య పంపగారాదాండి విశాఖ పట్నంలో" అంది సుందరమ్మ.

నిజమే, డబ్బుపోయినా బిడ్డ సుఖంగా ఉంటాడని రామయ్యకూడా సరేఅన్నాడు. ఎంతో బాధతోనే పంపుతున్నాడాయన డబ్బు. ఇంకో పాతికంటే కష్టమేనని ఆయనకు తెలుసు. సుందరమ్మకు మాత్రం తెలీకనా? భర్త డబ్బుకోసం బాధపడ్తున్నాడనే చింతకంటే, కొడుకు సుఖపడాలన్న కోరిక ఎక్కువేమో?

ఈ ఆలోచన వాడికి వచ్చలేదు. హోస్టలులో పెట్టే పాడుకూడు తినేందుకు కష్టపడ్డాడు కాని, చేతిలో పైసా మెదలకుండా మంచి భోజనంతో బ్రతికేందుకు కష్టపడలేదు. సరే వాడి ఖర్మ అనుకుని ఊరుకున్నారు.

*　　*　　*

"నే చెప్తున్నా గదా సత్యం, ఏదో మొదటి సంవత్సరం పరీక్షలయిపోయాయి. రెండో సంవత్సరం హాయిగా రెస్టు తీసుకో. కడపటి సంవత్సరం కాలమంతా నీ చేతిలోనే. బాగా అప్పుడు చదువు" అనుభవంతో తర్కాను తెచ్చుకోబోతూన్న సుబ్బారావు అనే కడపటి సంవత్సరప

# ఉపద్రవకరమగు కీటకములను చంపుడు

...అవి మలేరియా, టైఫాయిడ్, గ్రహణి, కలరా, మరియు అనేక యితర వ్యాధులను వ్యాపింపచేయును!

ఈగలు, దోమలు, బొద్దింకలు, మరియు నల్లులు త్వరగా అసంఖ్యాకములుగా పెరుగును. అవి మురికిలో నివసించుచు మీకు ప్రాణహానిని కల్గించగల క్రిములను యింటిలోనికి తెచ్చును. ఒక్క ఈగపై 6,000,000 క్రిములుండుట కనుగొనబడినది.

కీటకము చిన్నదిగా నిరపాయకరముగా అగుపడినను అది మీకు ప్రాణాపాయభయమును కల్గించవచ్చును. మీకు సోకకముందే కీటకములనులన్నిటిని చంపుడు. ఫ్లిట్‌లోగల తీవ్రమగు కీటకనాశనులు అన్ని కీటకములను త్వరగా నిశ్చయముగా చంపును.




స్టాండర్డ్-వాక్యూమ్ ఆయిల్ కంపెనీ (మెంబర్ల బాధ్యత పరిమితము)

విద్యార్థి ఇచ్చిన అమూల్యపు సలహా ఇది.

లెక్చరర్లు మాత్రం "రెండో సంవత్సరంలో నీ చదువును బట్టి ఉంటుంది మీరు పాసవటం. ఒచ్చే సంవత్సరం సముద్రం నడిమధ్యలో ఉన్నట్లనిపిస్తుంది. బాగా చదవండి" అని తల్లి బిడ్డకు చెప్పినంత ప్రేమతో చెప్పారు.

కాని చెముద్రోవలో బడ్డ బిడ్డకు తల్లి మాట లెప్పుడూ వినపడేం! సత్యాని కెందు వల్లనో కాని సుబ్బారావు సలహా నచ్చింది. ఏదో వానాకాలం చదువు పరీక్షలకోసం చదివాడు. ఈనాడు పాసు మార్కులు తెచ్చుకున్నవాడు రేపు బాగా చదివిన రోజు ఫస్టుక్లాసు తెచ్చుకోడూ ?

"నాన్నా పోయిన సంవత్సరం కన్నా అన్నీ వెలలు పెరిగిపోయాయి. తెల్లవార్లూ చదువుతున్నాను. ఆరోగ్యం చాలా వరకు చెడుతోంది. డాక్టరు టానిక్‌లు రాసి ఇచ్చాడు. లెక్చరర్లు ఈ సంవత్సరం వందయాభైరూపాయలు పుస్తకాలు కొనాలన్నారు. కాని పుస్తకాల డబ్బు మాత్రం పంపండి. మీ కష్టాలు నాకు తెలుసు. మీ ఆరోగ్యం కాపాడుకోండి. అమ్మకు నానమస్కారాలు" సత్యం.

చేరిన నెలలోపల ఈ జాబు రాశాడు సత్యం రామయ్యకు. రామయ్య రెండొందలుగా పంపి ఆరోగ్యం కాపాడుకో మని జాబు రాశాడు.

ఆరునెలల పరీక్షలలో వాడి మార్కులు చూసి లెక్చరర్లుఆశ్చర్యపోయారు. "బాగా చదవాలోయ్. ఆనర్సు కూడాను"అని మందలించారు.

ఈమాటు సెలవులలో మాత్రం 'చదువు కోరా' అని తండ్రి అన్నపుడల్లా చిరాకు వేసింది సత్యానికి. తనకు ఆమాత్రం తెలియదూ? ఎండాకాలం సెలవులకు ఊరెళ్ళ లేదు చదువుసాకుతో. చాలా ముఖ్యమని తండ్రికి రాసి, కలకత్తా ప్రాంతాలు తిరిగి ఓ రెండొందలు ఖర్చుపెట్టుకు వచ్చాడు.

* * *

నిజానికి ఏది ముందు చదవాలో, ఏది వెనక చదవాలో అర్థంకాలేదు సత్యానికి. ఉంటే పది నెలల టైము, పది సబ్జక్టు ఎప్పుడు చదవాలో ఎలా గుర్తుండటం? ఇది తల్చుకునేసరికి లెక్చరర్ల ముక్కలు గుర్తొచ్చాయి. కానిచేతులుకాలిన తర్వాత ఆకులు పుచ్చుకు ఏంలాభం? పోయిన సంవత్సరం మార్చిలో పెట్టిన పరీక్షలమార్కులు చూసే సరికి ప్రొఫెసర్ కూడా దిగ్భ్రమచెందిపోయాడు! కొండమీద ఉన్న మనిషి ఒక్క మాటు క్రిందపడ్డ ట్లనిపించింది. రామయ్య మాత్రం కడపటి సంవత్సరం కదా అని తొందరగా పంపుతున్నాడు.

"ఏం సత్యం, మీ నాన్న చాలా భాగ్యవంతుడా? లేదు చదవక్కర లేదని పంపాడా? ఆనర్సుకోర్సులో చేరావన్న సంగతి మరచావా? ఒచ్చిన రోజు ఎలా చదివావో గుర్తుందా? క్లాసు తెచ్చుకోక పోతే లాభం లేదు సరేకదా, ఈనాడు నీ తరహా చూస్తే పాసవుతావు అనే ఆశకూడా కన్పట్టం లేదు. మీ నాన్నకు జాబు రాసేదా ఎందుకైనా మంచిది?" అన్నాడు ప్రొఫెసరు సత్యాన్ని పిలిచి.

తల తీసేసిన ట్లనిపించింది సత్యానికి. పాత సంగతులన్నీ గుర్తుకొచ్చాయి. ఆనాడు తను ఫస్టుక్లాసులో పాసవుతానంటే పంపాడు తన తండ్రి. అంతే కాదు అడిగిన దానికంటే ఎక్కువడబ్బే పంపుతున్నాడు. ఎందుకు? చదువుకు బాగుపడాలనేనా? తనకోసం అరవైఏండ్లొచ్చిన ఇంత కష్టపడి తండ్రి పంపుతోంటే తను మూడు అర్లుగా ఖర్చుపెట్టూ విలాస పురుషుడిలా తిరుగుతున్నాడు. తనకు సలహా ఇచ్చిన సుబ్బారావు 'రెకమెండెడ్' డిగ్రీతో గేటు దాటాడు" ఇవన్నీ తల్చుకుని ఏం లాభం?

చదువు మొదలెట్టాడు సత్యం. కాని దాహమేసినపుడు బావి తవ్వుకున్న ట్లనిపించింది. ఏం చేయగలడు తనుమాత్రం? అహోరాత్రాలు కష్టపడి చదివాడు. చదివిందంతా రాశాడు.

* * *

ఇంటి కెళ్ళేసరికి కొడుకు ఆకారం చూసి ఫస్టుక్లాసు ఖాయం దనుకున్నాడు రామయ్య. ఏదో భారం తగ్గిన ట్లనిపించింది. తనను పోషించకపోయినా వాడి కాపరం సుఖంగా గడుపుకోగల డనిపించింది.

రిజల్ట్సు రానే వచ్చాయి. సత్యం నెంబరు, ఫస్టుక్లాసులో లేదు, సెకండు క్లాసులో లేదు. థర్డ్ క్లాసులో ఉంది! అంతకంటే పైన ఉండదని తెలుసు వాడికి. సుందరమ్మ మార్కులు వేసినవాళ్ళను శాపనార్థాలు పెట్టింది. కాని వాళ్ల దయవల్లనే పాసయాడని ఆమె కేం తెలుసు? సత్యానికి తెలుసు! రామయ్య ఎంతో బాధపడ్డాడు. "మనిఆర్డరు ఖర్చులతో కూడా, నాలుగువేల ఆరొందల యాభైరూపాయ లయింది నాయనా ఈ పనికిమాలిన థర్డ్ క్లాస్ డిగ్రీ కోసం" అన్నాడు.

(15-వ పేజీ చూడండి)

# కీలుకత్తిపీట

సీతమ్మగారింటికి రావడంతోనే, కామాక్షమ్మ కనుపించినవి రాశిగా పోసున్న మామిడికాయలు!—వాటిని చూడడంతోనే—"ఇంకా తరగలేదేమి!" అని అడిగింది కామాక్షమ్మ గోడకు చేరబెట్టి ఉన్న పీటను తనే స్వయంగా వాల్చి కూర్చుంటూ.

"ఎలా తరగడం చెప్పండి!—మా మోమ్మలు కత్తిపీటతో అవి నేను తరగలేనాయె!... కీలుకత్తిపీటకోసం ఉదయం నుంచీ వ్యాపకం చేస్తున్నాను. కానీ, ఉన్నా లేదనేస్తున్నారు కొందరు వాళ్ళకొంపేమిటో మునిగిపోతుందన్నట్టు." అంది సీతమ్మ తనూ ఓ పీట తెచ్చుకొని ఎదురుగా వేసుకొని కూర్చుంటూ.

"ఏం!?—రమణమ్మగారింట్లో ఓటున్నాదిగా!... ఆవిణ్ణడిగారా?"

"అడక్కేం!... అందరికన్నా ముందావిడనే అడిగేను. చక్కా లేదని చెప్పేసింది."

"ఏమిటీ, లేదని చెప్పేసిందా?...బలే బాగుంది వరస!—... మేమే అమ్మేసేమండీ వాళ్ళకో కీలుకత్తిపీట ఆరు రూపాయలకు!... అంత నిర్మొహమాటంగా ఎలా చెప్పేసిందోగానీ. అంత మహా బోడి భాగ్యానికే ఆ దాపరికమెందుకు చెప్పండి?!"

"ఏమో మరి!... ఓగంటలో ఇచ్చేస్తా ఓమారివ్వండి అని అడిగా—....."

"అయ్యో! ఏం మహా భాగ్యం కనక!—ఉంటే ఇవ్వనటండీ." అందామె. అలా ఆమె అన్నా నే నూరుకోలేదు. కామాక్షమ్మగారు మీకా మధ్య నమ్మేసినదో టుండాలికదా! అనడిగేను నిలవదీసి!—'ఓహో!... అదా, మా తమ్ముడుగారికి కావాలంటే ఇచ్చేసేమండీ!—" అంది. ఇకేమనడిగేది చెప్పండి?!".

"అదేమిటండీ అంత దాపరిక్కం!—వాళ్ళ తమ్ముడుగారికి ఇవ్వలే దెవ్వరికీ ఇవ్వలేదు. వాళ్ళింట్లోనే ఉంది!—నాకా సంగతి బాగా తెలుసు. తమ కత్తిపీటరిగిపోతుందేమోనని భయం కాబోలు!" అంది కామాక్షమ్మ చేతు లూపుతుంటూ.

"ఏమో మరి!— లేదు ఖచ్చితంగా చెప్పేసిందామె!" అంది సీతమ్మ.

"అసలామె తత్వమే అంతండి!—ఆ మధ్యని మా అక్కా బావా వచ్చినప్పుడు 'కొంచెం మజ్జిగ చుక్కుంటే ఇవ్వండి రమణమ్మగారూ ?' అని నోరు విడిచి అడిగేను వాళ్ళకు రెండు పాడిగేదలున్నాయి కదా అని. ఏమందో తెలుసాండి?!—'అయ్యో పిన్నిగారూ,!—అడక్కడక్క అడిగేరు—నిజంగా నాకెంతో చిన్నతనంగా. ఉంది లేదని చెప్పడానికి!... నిన్ననూ పాలన్నీ కుండలోఉంచి పొయ్యిమీద పెడదా మనుకుంటూఉండగానే మా నానిగాడు కుండెడు పాలనూ తిరగతోసేసేడు. ఇవాళ్టికి మేమే కొంచెం మజ్జిగ కొనుక్కున్నాము.' అంది. అవాళ మధ్యాహ్నం వాళ్ళ అప్పారావుగాడిని పిలిచి అడిగేను, నిజం తెలుసుకుందామని!—అవాళ వాళ్ళు చక్కా పెరుగూ అన్నం తిన్నారుట!—మరి చూశారా ఆమె లోభత్వం?!—కాసింత మజ్జిగ చుక్కిస్తే ఏమయిపోతుంది చెప్పండి?! ఊరికినే పొరబొయ్యటానికి ఒప్పుకుంటుందిగాని, మనలాంటి వాళ్ళకో ఇంత ఇవ్వడానికి దాని మనసొప్పదండీ!" అని రమణమ్మ మీద తన కున్న కుళ్ళు నంతటినీ వెళ్ళగక్కింది కామాక్షమ్మ.

"ఇంకో గమత్తు చూచేరు కారు!—తెల్లారి లేచి మనింటికి చీటికీ మాటికీ వచ్చేసి ప్రతీదీ పట్టుకెళ్ళిపోతుంది. మా ఇత్తడిపాత్ర నాలుగు నెలల క్రిందట పట్టుకెళ్ళిపోయింది. వాళ్ళింటికెవరో చుట్టాలొచ్చే రిద్దెన్ల చెయ్యాలంటూ!—ఇప్పటికివ్వలేదు చూడండెలాఉందో! ఇవాళేలానూ కబురుపెడతానిచ్చేయమని. మందికత్తిపీటివ్వడానికి అంతలా చస్తున్నప్పుడు నేను మాత్రం ఏదయినా ఎందుకివ్వాలి? ఇకనుంచీ నేనూ ఏవీ ఇయ్యను అక్కడికి కడుతుందా రోగం!—మనలో మనం ఏది లేకపోయినా సర్దుకుపోవాలిగానీ, ఇలా ఒంటెత్తుగా ఉంటే ఎలా చెప్పండి?!" అనంది సీతమ్మ.

"ఆ!—మీ ఇంట్లోంచి ఇత్తడిపాత్ర పట్టుకెళ్ళిపోయిందేమిటి?!—మా ఇంట్లోంచి పులుసు గంగాళం పట్టుకెళ్ళిపోయిం దాగు నెలల క్రిందట!—డబ్బుండి కూడా వాళ్ళకి ముష్టి బ్రతుకెలా ఉందో చూడండి!—మనిళ్ళకొచ్చి అన్నీ పట్టుకెళ్ళిపోతుందిగానీ మనవసరానికి ఉన్నా ఇవ్వరు!...పెద బాధ నా మనస్సెలాంటిది అంటే, అవతలవాళ్లు నోరు విడిచి అడిగినప్పుడు ఉండీ కూడా లేదనడం నాకు చేతకాదండీ అరవకొమ్మలాగ! ఆఖరికి నా స్వంతిపనయినా మానుకొని ఇచ్చేస్తాను—...అన్నట్టు ఇప్పుడు మీ ఇంటికి వచ్చిన పనే మరచిపోయేను!—కొంచెం చింతపడుంటే బదులిద్దరూ?—మా ఆయన కొన్న వెంటనే ఇచ్చేస్తాను?" అనడిగింది కామాక్షమ్మ.

కామాక్షమ్మ ఏదో ఓటి బదులడగడానికే వచ్చుంటుందని మొదట్లోనే గ్రహించింది. సీతమ్మ!—అంతలా రమణమ్మను విమర్శిస్తున్న కామాక్షమ్మ, రమణమ్మకేమాత్రం తీసిపోదన్న సంగతి సీతమ్మకు బాగా తెలుసు!—అదివరకప్పుడే ఓ రెండు నెలల క్రిందట, కామాక్షమ్మ రెండడ్డల కంది పప్పూ, ఓ అడ్డెడు పెసరపప్పూ, ఓపీశెడు పంచదార బరువు పట్టుకెళ్ళి ఆ ఊసే మరచిపోయినట్లు అంతవరకూ ఇవ్వనే లేదు. ఇక చిల్లరగా పట్టుకెళ్ళిన ఉప్పునీ, జీలకర్రనీ,

శ్రీ ఆకుండి నారాయణమూర్తి

ధనియాలనీ—ఇలాంటి వాటికి లెక్కే లేదు. అలా ఆమె పట్టుకెళ్లడమే కాక, తీరా తనకవసరముండి ఏదయినా అడుగుతే రమణమ్మను మించిపోయేటట్లు నిర్మొహమాటంగా లేదని చెప్తుంది!— ఆ రోజున తన భర్త స్నేహితుడొకడింటికి వచ్చినప్పుడు బియ్యం నిండుకోగా, ఆమె నడుగుతే—"అయ్యొ!...అక్కయ్యగారూ, నేనే మీ ఇంటికి వాటికోసం వద్దామనుకుంటున్నానని" చక్కని భాషలో చెప్పేసింది. పైగా ప్రతీ ఒక్కరినీ విమర్శించుతుందని సీతమ్మ కామెపై కోపం!—నిజానికి కిలుకత్తిపీట కామాక్షమ్మ ఇంట్లో ఉంటుందని సీతమ్మకు తెలిసింది. ఇక అడగడానికి అదే సమయమని—

"కొత్త 'కూరగాయలండీ'!...మీ ఇంట్లో కూడా ఓ కిలుకత్తిపీటుందని రమణమ్మ చెప్పిందండీ!—ఉంటే ఓ మాటిస్తారా?" అనడిగింది.

"ఇదో కటా!... బాగానే ఉంది. మా ఇంట్లో ఉంటే మీ కియ్యడానికేం పోయింది చెప్పండి?!—...ఆ రోజుల్లో డబ్బుకి కొంచెం కొరకటంగా ఉండటం మూలాన, అది వాళ్లకి అరకూ పోయులకమ్మేసేము. మా ఇంట్లో ఎక్కడుంది?... ఇంట్లో ఉంచుకొని లేదని చెప్పడమే చాలు చాలు!...పైగా మా ఇంట్లో ఉందని కూడా చెప్పిందేమిటి?.. బాగు! బాగు!!

"ఏమో మరి!...మీకు రెండు కత్తిపీటలుండేవనీ— రెండూ మీ కవసరమవటం చేత ఓటి వారికమ్మేసేరనీ...ఆ కొన్నది వాళ్ల తమ్ముడిగారికి కావాలంటే ఇచ్చేసేరనీ—మీ ఇంట్లో మాత్రం ఓటుందనీ—ఆమె కా సంగతి బాగా తెలుసననీ—చెప్పింది."

"ఎంత బొంకులాడి!... నామీద మీకు చెడ్డ అభిప్రాయం కలగడంకోసం అలా చెప్పింది తెలుసాండి!... అబ్బేస్!— అదెక్కడ... జిత్తులమారిది!!—ఇంతకీ నా సంగతెలాంటిదో మీకు తెలుసు గనక ఫరవాలేదు గానీ—లేకపోతే మనకీ మనకీ జట్టీ పెడదామనే కదా దానుద్దేశ్యం?"

"అబ్బే!—రమణమ్మ మాటలను ఆధారంగా తీసుకొని నే నమ్మలేదులెండి!— కానీ మీ ఇంట్లో రెండు కత్తిపీటలుండేవని వరసమ్మగారు కూడా చెప్పేరు."

కామాక్షమ్మ గుండె దిగజారినట్లయింది. దానికి సమాధానంకోసం తడుముకోవలసి వచ్చింది. కానీ కొంచెం గడుసుదనం చేత త్వరలోనే తేరుకొని—"ఔను!... రెండు మాయింట్లో ఉండేవి ఒకప్పుడు!— ఆ విషయం నిజమే!—అసలు అందులో ఓటి మా పుట్టింటారిది. అమధ్య మక్కువ నుంచి, మా నాన్నగారికి బల్లిపేట ట్రాన్సఫరు అయినప్పుడు, అక్కడ ఇల్లు దొరక్కపోడంచేత, సాలూరులో దిగి మా ఇంట్లో వారి సామానంతా ఉంచేసేరు. ఆ సామానులతో పాటు వాళ్ళ కిలుకత్తిపీటకూడా మా ఇంట్లో కొన్నాళ్ళపాటుంది. ఇప్పుడు అక్కడ వాళ్ళకు ఇల్లు దొరకడంచేత ఈమధ్యనే వారి సామానంతా పట్టుకెళిపోయేరు. మాకు మాత్రం ఒక్కటే ఉండేది. ఆ ఉన్న ఒక్కదాన్ని రమణమ్మగారికి అమ్మేసేం!—అంతే!"

"సరే. దానికేంలెండి!—అంతగా కిలుకత్తిపీట దొరక్కపోతే మా మాలు కత్తిపీటతోనే మా వారిని కోసేయమంటాను. చేతనయితే తను కోస్తారు, లేకపోతే కూలివాళ్ళను. పెడకారు అంతగా కాకపోతే క్రొత్తది కొంటారు!!" అంది సీతమ్మ మంచి హుందాతనంతో.

"సభ్రంగా ఓటి కొనేసుకుందురూ శాశ్వతంగా ఉంటుంది. ఎందుకొచ్చిన బాధ వాళ్ళనీ వీళ్ళనీ అడగడము?!—హాయిగా మాలాంటి వాళ్ళకు కూడా సదుపాయంగా ఉంటుంది!" అంది కామాక్షమ్మ కొంచెం కొంచెంగా నవ్వుతూ.

ఏడిచినట్టుందనుకుంది సీతమ్మ!

చింతపండు అప్పు ఇచ్చినప్పుడు, లోగడ పట్టుకెళ్ళిన బదుళ్ళ విషయమై జ్ఞాపకం చేసి అంతలా అడుగుతుందనుకోలేదు. కామాక్షమ్మ!!—

*  *  *  *

"అయితే సీతమ్మగారూ!... ఎలా అయితేనేం కామాక్షమ్మ కత్తిపీటిచ్చిందన్నమాట!... ఇక నివాళేదో పెద్ద ప్రళయం తప్పదు!" అంది రమణమ్మ అక్కడ గోడకు చేరబెట్టి ఉన్న కిలుకత్తిపీట వేపు చూస్తూ.

"అబ్బే! మనఃపూర్వకంగా ఇవ్వాలనుండి ఇవ్వలేదామె!" అంది సీతమ్మ పిల్లాడి కన్నం కలుపుతూ.

సీతమ్మ కూర్చోమని చెప్పకపోయినా తనే స్తంభాని కానుకొని చతికిలపడి కూర్చుంది రమణమ్మ. మళ్ళీ గొంతు సవరించుకొని—"అయితే ఈ కత్తిపీట మీ ఇంటికెలా వచ్చింది" అని అడిగింది.

"మా ఆయన తీసుకొచ్చేరు! మీరు లేదన్న తరవాత మీమాట సాధారణంగా చేసుకొని, కామాక్షమ్మగారిని కూడా అడిగేను. ఆమెకూడా అతి మృదువయిన భాషలో లేదని చెప్పేసింది!...కిలుకత్తిపీటక్కడా దొరకలేదని మా ఆయనతో చెప్పేను. ఆయన సరే, నే తెస్తానుండ'ని—ఈ కత్తిపీట తెచ్చేరు. ఎక్కడనుంచి తెచ్చేరని అడిగితే—"కామాక్షమ్మగారింటినుంచే!" అన్నారు. నే నెంతేనా ఆశ్చర్యపోయానంటే నమ్మండి. అయితే వీళ్ళకెలావచ్చిందండీ ఇది?—అనడిగాను—'పాపం, ఆమె భర్తిచ్చేడు అటకమీంచి తీసి!... ఆయన నాకిది ఇచ్చేడన్న సంగతి పాపం కామాక్షమ్మగారికి ఇప్పటికికూడా తెలిసుండదు. అన్నారు." అంది సీతమ్మ నవ్వుతూ.

"చూసేరా!...మరి ఇంట్లో ఉంచుకొనే ఎలా చెప్పిందో!... ఆ కామాక్షమ్మ తత్వమే అలాంటిదని నేమొదటినుంచీ చెపుతున్నానుకదండీ!... పైగా ఈర్ష్య కొద్దీ నా మీద అన్నీ చెపుతూ ఉంటుంది' అంది రమణమ్మ తనో నిజాయితీ గలమనిషిననే భావం వ్యక్తం అయేలా?

"నిజమే లెండి!...ఆ కత్తిపీట మీ కమ్మేసినట్లూ, అది మీ ఇంట్లోనే ఉందన్న విషయం తను ఋజువుచేయగలనని కూడా చెప్పింది!...మీ కెందు కంత శ్రమ! మీ ఇంట్లోవుంటే ఇయ్యండి. లేకపోతే ఊరుకోండి అని ఖచ్చితంగా చెప్పేసేను."

"మంచిపని చేసేరు!...ఇంతమహా వస్తువూ అరిగి పోతుందనే గాబోలు లేదని చెప్పేసింది. ఏం మహా భాగ్యం గనక!—కానీ ఇప్పుడు దానికి బలే పరాభవం జరిగింది లెండి!...వాళ్లాయిన దానిలాగా కాక చాలా మంచివారు. అదీకాక మీ ఆయన, మా ఆయన, వాళ్లాయన ఒకే ఆఫీసులో గుమాస్తాలుగా పనిచేస్తున్నారు కదండీ!...కురా పరిచయంమీద మీ ఆయనడగానే ఇచ్చేడాయన. ఇంతకీ ఆ మొగాళ్లకున్న పాటి బుద్ధి మనాడవాళ్లకు లేదండి!...అందుకే మనాడవాళ్ల బ్రతుకు లిలా కాలుతున్నాయి!...చాలా చిన్న విషయాలను పెద్ద విషయాలు చేస్తూ ఒకరిమీద కొకరు పోటీలు చెప్పుకుంటూ ఉండడం మనాడవాళ్లలో ఉన్న ఓ పెద్ద జబ్బు!!...అందులోకి భోత్రిగా ఆ కామాక్షమ్మ ఉండే..."

"ఇష్!...ఆగండి రమణమ్మగారూ!...అదుగో కామాక్షమ్మగారు వస్తున్నారు." అంది శీతమ్మ.

కామాక్షమ్మ కూడా లోపలకు వచ్చి కూర్చొంది. పాపం ఆమె ఇంకా గోడ వార నున్న కత్తిపీటవేపు చూడలేదు. తరిగి ఉన్న మామిడి కాయలను మాత్రం చూచింది.

"ఆఖరికది ఎలా తరిగించేసేరు?" అనడిగింది.

"బలే!... తెలీనట్లు మాట్లాడుతున్నారే! కత్తిపీట మీ ఇంటినుంచే తెచ్చినట్లు చెప్తున్నారే శీతమ్మగారు!" అంది రమణమ్మ.

"మా ఇంటినుంచా!...ఏదీ?" అని ఇటూ అటూ చూచింది కామాక్షమ్మ.

"మా ఆయన తీసుకొచ్చేరు!...నిన్న సాయంత్రం మీ ఆయన నడగగా పాపం, అప్పుడు అట కెక్కి తీసి ఇచ్చేరట!... అప్పుడు మీరు వంటింటిలో వంట చేసుకుంటున్నారుట!..."

కత్తిపీట వేపు చూస్తూ నిర్ఘాంతపోయింది కామాక్షమ్మ!—తన పరువు అమాంతంగా రమణమ్మ ముందు నట్టేటిలో కలిపేసినందుకు వాళ్లాయన పిలక పట్టుకొని ఝాడించేద్దామన్నంత కోపం వచ్చింది. కామాక్షమ్మకు—బొంగురు పోయిన గొంతుకతో—"అయితే మా నాన్నగారు వారి సామానులు పట్టుకెళ్లి పోయినప్పుడు ఇది మరచిపోయేరు గాబోలు అటకమీద!... నే నింతవరకూ పట్టికెళ్లిపోయేరనే అనుకుంటున్నాను." అని ఎలాగో సమర్థించపోయింది కామాక్షమ్మ.

కామాక్షమ్మ పడుతున్న బాధ చూచేసరికి బాగా నవ్వు వచ్చింది శీతమ్మకు. మళ్లీ అంది—"ఏదో మీ ఇరువురి ధర్మమా అంటూ రెండు కత్తిపీటలుండబట్టి, మా ఆయనా నేనూ కలసి చాలా త్వరగా కోసేసేము!.. ఇక మీ కత్తిపీటలు మళ్లీ అటక మీద పెట్టేసుకోవాలనుంటే, తీసుకుపోండి!" అంది శీతమ్మ కొంచెం కొంచెంగా నవ్వుతూ.

"ఇది కాక ఇంకో టెక్కడదీ?" అని ఆశ్చర్యంతో అడిగింది రమణమ్మ.

"మీ ఆయన్ని కూడా అడిగేరు మా వారు!...ఏదో మంచివారు కాబట్టి ఇచ్చేరు మూలనున్నది బైటకు తీసి!... అదుగో ఆ చాపవారున్నాది మీ కత్తిపీట" అని అంది శీతమ్మ అటువేపు చూపించి నవ్వుతూ!.

రమణమ్మ ముఖం కూడా తెల్లబోయింది. ఇద్దరూ ఉడుకుపోతనంగా లేచి, గిరుక్కున వెనక్కు తిరిగేరు. వారి వారి భర్తల అంతు కనుక్కొనేందుకు!!!— ★

## అబ్బాయి చదువు

(12-వ పేజీ తరువాయి)

"చేరమన్న రోజే బి. యే లో చేరలేదు నన్ను క్షమించండి నాన్నా" అన్నాడు సత్యం.

క్షమించేందుకు ఏముంది? వారి కాళ్లూ వీరి కాళ్ళూ పట్టుకు, నూరు రూపాయల గుమాస్తా ఉద్యోగ మిప్పించాడు రామయ్యే!

సత్యం కొన్నిరోజులు బాధ పడ్డాడు, కాని అలవాటయింది ఆ ఉద్యోగమే!

కాని ఇంతడబ్బు పోసికూడా, కొడుకును నూరురూపాయల గుమాస్తాగా చేశానే అన్న రామయ్య దిగులు, "ఏనాటికైనా మా నాయన ఆఫీసర్ అయి అయిదొందలన్నా సంపాయించడా అన్న" సుందరమ్మ ఆశమాత్రం తీరనివి. ★

# అన్యాయం

తొలికోడి కూసింది. పల్లెటూరి సామాన్యప్రజానీకాని కటు తర్వాత నిద్ర రాదనే చెప్పాలి. ఆ వేళకు మెలకువ రాకపోతే, వాళ్ళు జీవించటమే కష్టం. గ్రామసీమంతా కలకలలాడుతూంటుంది. అప్పుడు లేచి పనులు ప్రారంభించడానికి ఎంతో ఉత్సాహకరంగా వుంటుంది.

స్త్రీలు మొదటిగా లేచి తమ గృహాలను పరిశుభ్రం చేస్తున్నారు. వాకిళ్ళూడ్చి, నీళ్ళు చల్లి ఎంతో అందంగా ముగ్గులేస్తున్నారు. ఆవుదూడలు, తల్లిపాలకోసం 'అంబా' అని వాటి శక్తికొలది అరుస్తున్నై. తెల్లవారుతున్నందుకు సంతోషిస్తూ, 'కాకా' అంటూ కాకులు అరుస్తున్నై. గృహాలంకారం పూర్తికాగానే, చంకను బిందెలుంచుకొని నీళ్లు తెచ్చే నిమిత్తం చెరువుకు పోతున్నారు, కొందరు స్త్రీలు. వాళ్ళల్లో వాళ్ళు ఏవేవో కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ నడుస్తున్నారు.

ఊరిచివర ఉన్న దొక పూరిగుడిసె. దానిలో మనుష్యులు నివసిస్తున్నారని ఎవ్వరూ అనుకోరు. ఇంతవరకూ ఆయింట్లో ఎవరూ, లేవలేదు. ప్రక్కింటావిడ వచ్చి పిలుస్తోంది.

"సీతమ్మా! ఓ, సీతమ్మా! ఇంకా నిద్రేనా? లేవమ్మా తెల్లారిపోయింది."

ఎవరూ పలికినట్టు లేదు. తలుపుగా అమర్చబడిన తడికను తప్పించి లోనికి వెళ్లిందావిడ. ఇంట్లో తల్లీ కొడుకూ నిద్రపోతున్నారు. చిన్న ప్రమిదమాత్రము వారికి కాపలాకాస్తున్నట్లు వెలుగుతోంది.

"రాముడూ! ఒరే, రాముడూ! ఇంకా నిద్రపోతున్నావా? పనిలో కెళ్ళవూ?"

"వెళ్తా. అబ్బ, అప్పుడే తెల్లారిందా?" కళ్ళు నలుపుకుంటూ ఒక ప్రక్కకు ఒదిగాడు రాముడు.

"మళ్ళీ పడుకుంటావే? లే!"

బలవంతంగా లేచాడు.

"రాత్రంతా జ్వరం అమ్మకి, నిద్రలేదు. ఇప్పుడే నిద్రపోయాం" అన్నాడు రాముడు ఆవులిస్తూ.

"త్వరగా లేచిపో, లేకపోతే మీ దొర ఊరుకోడు."

"వెళ్తున్నా. పిన్నీ, అమ్మకు కాస్త గంజికాచివ్వవూ? పుణ్యముంటుంది." అని చెప్పి వెంటనే బయలుదేరాడు రాముడు. ఆ రాత్రంతా నిద్ర లేదేమో చాలా బద్ధకంగావుంది. తన తల్లికి జబ్బుగా ఉన్ననాడు కూడా పని మానడానికి వీలు లేనందుకు తన అదృష్టాన్ని నిందించుకున్నాడు. ఆ కొంచెం స్వేచ్ఛ తనకు లేదు. 'ప్రపంచంలో ఎన్నో పక్షులూ, జంతువులూ స్వేచ్ఛగా బ్రతుకుతున్నయ్యే, నా కామాత్రం స్వేచ్ఛయినా లేకపోయింది. నేను వాటికంటె నీచుడనా? బ్రతికినంత కాలం, యిలా బండచాకిరి చేయవలసిందేనా? ప్రతిరోజూ, దినమంతా పనిచేసినా సరిపడు జీతాన్నివ్వలేడా దొర. పోనీ అయిచ్చే కొంచెమైనా ఎప్పటికప్పుడిస్తే బాగుండును. ఇప్పటికి రెండు నెలలనుండీ జీతం ఇవ్వలేదు. మేమెలా జీవించాలి. పైగా ఎప్పుడన్నా అడిగితే కసురుకుంటాడు. ఇలా జీవించడం కష్టంగానే వుంది. కాని, ఏం చేయగలం? ఇంతకీ బీదవాళ్ళమై పుట్టాము. కర్మ అనుభవించవలసిందే గాబోలు! ఇవాళైనా ఏమైనా, ఇస్తాడో ఇవ్వడో?' ఇలా ఏమేమో అనుకుంటూ దొరయింటికి చేరాడు. అప్పటికి బాగా తెల్లారిపోయింది. సూర్యుడు కూడా ఉదయించేశాడు. మామూలువేళ మిగిలిపోయింది. ఆలస్యమైనందు కాయన ఏమంటాడో అనే భయంతోనే లోనికి ప్రవేశించాడు. మామూలు పని ప్రారంభించడానికి పశువుల పాకలోకి పోతూంటే ఎదురుగా వచ్చాడు సోమయ్య. చేతులో వెదురుబద్ద చూడగానే వణికిపోయాడు రాముడు. సోమయ్య తన నెలాగూ కొట్టకమానడు. అయితే ఇప్పుడేమిటి, చేయడం. రాముడి కేమీ తోచలేదు. చేతులు నలుపుకుంటూ నిల్చున్నాడాయన కెదురుగా.

"ఏంరా! కళ్ళు నెత్తిమీదికొచ్చాయా! ఇప్పటిదాకా కూర్చుంటే పనులన్నీ ఎవరు చేస్తాడు, నీ బాబు?" ఉగ్రావతారంలో గర్జించాడు, సోమయ్య. రాముడి కళ్ళలో నీళ్ళు తిరిగినై.

"మా, అమ్మ జబ్బుగా వుందండి..." అని యింకేంటో చెప్పబోతూంటే అతని మాట కడ్డువచ్చి,

"మీ అమ్మకు జబ్బయితే నీకేం రోగం? అదొక వంకదొరికిందే!......కొట్టకముందే ఏడుస్తున్నావే! మీ మీద దయ దల్చకూడదురా." అంటూనే చెయ్యి పైకెత్తేప్పటికి రాముడిగుండె జారిపోయింది. సోమయ్య చేతిలోని బద్ద రాముడి శరీరం మీద తనిష్టం వచ్చినంతసేపు నాట్యమాడింది. కొంతసేపటికి ఆగిపోయింది. ఒకవేళ సోమయ్య చెయ్యి నొప్పి పుట్టిందేమో! తాను చేసినపనికి సంతోషిస్తూ అక్కడనుండి వెళ్ళిపోయాడు సోమయ్య. దెబ్బ తగిలిన చోటెల్లా వాచింది. కొన్ని చోట్ల బద్దరాపిడికి రక్తంకూడా కారుతోంది. రాముడికి, సోమయ్య చేతిలో దెబ్బలు తినడం, ఇది క్రొత్తకాదు. ఇలాటివి ఎన్నో రోజులు కాలగర్భంలో కలిసిపోయినై. తన దెబ్బల్ని లెక్కించకుండా, తన మామూలుపని కుపక్రమించాడు రాముడు. ఆ రోజంతా ఓపికగా పనిచేశాడు.

* * *

లోకాన్యాయాలను చూడకుండా దాక్కున్నాడు సూర్యుడు. 'నాకు తప్పుతుందా' అన్నట్టు తన సహచర నక్షత్రసమేతంగా అలంకరించాడా స్థానాన్ని, చంద్రుడు. రాత్రి సుమారు గం|| 9 కావస్తోంది. 'రాముడు పనులన్నీ ముగించుకొని, వాళ్ళు పెట్టిన కాస్త అన్నం నీళ్ళు కారుతూవున్నా తృప్తిపడి భోంచేశాడు. అప్పటికిగాని తన తల్లిని జ్ఞాపకం చేసుకొనేందుకు సమయం చిక్కలేదు. ఇంట్లో బియ్యంలేవు. తల్లి మంచం పట్టివుంది'

శ్రీ తిరుపతి వేదామృతం ఎల్లిజ్

ఆమెకు మందిప్పించడానికి తన చేతిలో ఒక కానీకూడా లేదు. ఇంట్లో పరిస్థితు లన్నీ జ్ఞాపకం వచ్చాయి రాముడికి. తల్లికి మందిప్పించాలి. తనకు డబ్బెవ రిస్తారు? సోమయ్యే దిక్కు. సోమయ్యను తలంచు కొనేటప్పటికి భయం పుట్టింది. అయినా తప్పదు. తన తల్లికోసమైనా అడగాలి. భయంతోనే సమీపించాడు సోమయ్యా గార్ని. ఆయనను చూడగానే కంపించి పోయాడు. ఎలాగో ధైర్యంచేసి చివరికి

"బాబుగారూ!..." అని యింకేదో అనబోయి ఆగిపోయాడు.

"ఏం? ఏమొచ్చిందీ?" అధికార పూర్వకంగా ప్రశ్నించాడు సోమయ్య.

"మా అమ్మ జబ్బుతో పడుందండి. మందిప్పించడానికి డబ్బులేదు. ఇంట్లో గింజలు లేవు. ఓ అయిదు రూపాయ లిచ్చారంటే రక్షించినవా రవుతారు."

"పనైతే సరిగా చెయ్యవుగాని, జీతం మాత్రం సరిగా కావాలి, ఏం? ఇప్పుడు నా దగ్గర డబ్బులేదు. తర్వాత ఇస్తాలే."

"ఏదో, క్షమించండి బాబూ! తమరు కోప్పడితే బ్రతకలేం......క్రిందటి నెల కూడా యిప్పించారు కాదు. జరగటం కష్టంగా వుందండీ—

"క్రిందటి నెలజీతం ఎంత కావాలో తెలుసా?"

"చిత్తం. నాకేమీ ఇయ్యాలేదండి. పది రూపాయలూ, రావాలండి"

"పదా, పందా? ఆరురోజులు పని మానేస్తే రోజుకు రూపాయి కొలిచ్చి పని చేయించుకున్నా. ఆ ఆరురూపాయలూ నీతా తిస్తాడా?"

"జబ్బురాబట్టి రాలేకపోయాను. కోరి పోకే మన్నానా బాబూ"

"జబ్బే వచ్చిందో, యింకేమైనా వచ్చిందో మాకు తెలియదు. నీమూలంగా అయిన ఖర్చు నీజీతంలో మినహాయించుకొంటాం. మిగిలిన నాలురూపాయలకీ 2 కుంచాల వడ్లు కొలిపించు కెళ్ళు."

"మా అమ్మకు ప్రమాదంగా వుంది బాబూ, మందిప్పించుకుంటాను, ఈ నెల జీతంలోనించి రెండు రూపాయలివ్వండి" ప్రాధేయపడ్డాడు రాముడు. "ఒకే చెప్పేదినీకు కాదు? మానవజన్మ ఎత్తలా? ఇప్పుడు లేదంటే మళ్ళీ అడుగుతావే?

రాముడి కళ్ళలో నీళ్ళు తిరిగినై. పాపం ఏం చేస్తాడు. ఈ లోకంలో తన తల్లి తప్ప 'నా' అనే వాళ్ళెవరూ లేరు చివరికి కష్టసమయంలో తల్లిని సుఖపెట్టేందుకైనా నోచుకోలేదు. పడిన కష్టానికి జీతం అడగడంకూడా తప్పేనా? నెలంతా పని



'చేయించుకొని జీతం ఇవ్వడానికి ఇంతగా బాధపడతా రెందుకు? కష్టాల్లో ఉన్నప్పుడు కూడా కనికరం ఉండదు. అసలా కనికర మనేదాన్ని కలిగినోళ్ళకు పెట్టడేమో భగవంతుడు. కలిగినోళ్ళకి పెట్టకపోతే లేనోళ్ళకి పెట్టి లాభం ఏంటి? ఇదంతా చూస్తుంటే భగవంతుడికి కూడ బుర్ర లేనట్టుంది. పోనీ అలా చేసినవాడు బీదవాళ్ళను తాను కాపాడకూడదూ? కష్టాలనుభవిస్తున్న వాడికే పదేపదే కష్టాలు వస్తుంటై. సుఖమనుభవించేవాళ్ళు సుఖపడుతూనే వుంటారు. ఇది చాలా చిత్రంగా వుందే! అసలు దేవుడి కింత పక్షపాత బుద్ధి ఎందుకుండాలి? ఆయన ఉన్నాడా లేడా? ఇదొక పెద్దగడ్డుసమస్య. దీన్ని తీర్చడం చాలా కష్టంగానే వుంది. ఇది మానవుల జ్ఞానానికి అందేలాగు లేదు. వున్నాడనడానికీ, లేడనడానికీ మార్గాలు కనబడుతున్నై. అయినా ఆ విషయం ఆలోచించడమే తప్పు.

ఏంచేంటో ఆలోచిస్తూ ఇల్లు చేరాడు రాముడు. తల్లి పక్కమంచంలో వుంది

మూల్గుతూ. తన కొరకే ఎదురుచూస్తోంది. తొందరగా మంచందగ్గరి కెళ్ళాడు. చెయ్యి తాకి చూశాడు. జ్వరం మండిపోతోంది. కళ్ళు తెరిచి తన కొడుకువైపు చూసింది సీతమ్మ. రాముడివంటిమీద దెబ్బలు స్పష్టంగా కనిపిస్తున్నై.

"బాబూ! ఈ దెబ్బలేంటి? నిన్ను కొట్టారా?" అంది నీరసంగా.

"ఏమీ లేదమ్మా! నీవు పడుకో. గంజి కాసివ్వనా?" చిరిగిన కండువాతో శరీరం కప్పుకుంటూ జవాబిచ్చాడు రాముడు.

"మనం బీదవాళ్ళం నాయనా! మనం బీదవాళ్ళం!" కన్నీళ్ళు కార్చింది. బీదవాళ్ళకోపం కన్నీళ్ళుగానే బయటికి వస్తుంది. అదే వాళ్ళు చేయగల్గిన ప్రతిక్రియ. అలాగే ఒకళ్ళ నొకళ్ళు చూస్తూ నిశ్శబ్దంగా వుండిపోయారు చాలాసేపటి వరకు.

* * *

సీతమ్మకు జ్వరం తీవ్రరూపం దాల్చింది. బీదవాళ్ళకు మందు ఎక్కడ నుండి వస్తయ్? డబ్బు లేకుండా, ఏ డాక్టరొస్తాడు. పేరు కెన్నో ధర్మాసుపత్రులున్నాయి. పేరుకైనా ధర్మం కనిపించ దక్కడ. ఆసుపత్రిలో చేర్పించాలని రాముడుపోయి అడిగితే 'ఇప్పటికే, కాళీలు లేక ఎంతో మంది ఆగిపోయారు నీకెక్కడనుండొస్తుంది?' అని కసిరారు. రాముడి కేమీ తోచడంలేదు. తల్లి బాగా నీరసించిపోయింది. అందులో, వృద్ధాప్యం. తల్లిని ఆ స్థితిలో వదలలేక పనికూడా మానేశాడు రాముడు. చేతిలో డబ్బులేదు. తన కెవ్వరప్పిస్తారు? ఇరుగు పొరుగువాళ్ళంతా 'అయ్యో, పాపం!' అన్నారేగాని ఒకళ్ళూ సహాయం చేసినపాపాన పోలేదు. రాముడికి పిచ్చెక్కినట్లయ్యింది. తల్లిని కనిపెట్టుకొని అలాగే కూర్చున్నాడా గుడిసెలో. తల్లి బ్రతుకుతుందన్న ఆశ అతనికి పూర్తిగా నశించింది. ఏ క్షణంలో, ఏం జరుగుతుందో, అని తీక్షణంగా కంటిరెప్ప వాల్చకుండా కనిపెడుతున్నాడు. రాత్రి గం 1. అయ్యింటుంది. జీబుగపిట్ట అరుస్తూ యింటిపైగా పోతున్నట్లనిపించింది. రాముడికి అనుమానం కల్గింది. వెంట మంచందగ్గర మోకరించి, తల్లి కళ్ళలోకి చూశాడు. ఆమె అతనివైపు చూస్తూనేవుంది. బయటనుండి కుక్కల అరుపులు స్పష్టంగా వినిపిస్తున్నై. ఆమె రెండు చేతులూ పట్టుకున్నాడు. ఆమె అలాగే చూస్తోంది. మాటమాత్రం లేదు. కళ్ళలోనుండి నీరు ధారగా కారుతూంది. ఏదో చెప్పాలని ప్రయత్నించింది, కాని మాటలాడలేకపోయింది.

అది అంత్యగడియ అని రాముడికి తెలిసింది. చిన్న పిల్లాడిలాగు బిగ్గరగా ఏడుస్తున్నాడు. సీతమ్మ కంటిరెప్ప వాల్చకుండా కొడుకును చూస్తూనే వుంది. క్రమంగా కళ్ళు తిరగ నారంభించినై. కనుపాపలు క్రమంగా పైకి పోతున్నై. అవి కనపడకుండా పైరెప్ప చాటుకు పోయినై. రాముడి చేతిలోనుండి సీతమ్మ చేతులు జారిపోయినై. అంతే! అంతా అయిపోయింది. రాముడు కెవ్వున కేక వేశాడు. శబ్దానికి యింటి ప్రక్కవాళ్లు వచ్చారు. లోకసాంప్రదాయం ప్రకారం, వారికి తోచినట్టు ఓదార్పుమాటలు వల్లించి వాళ్ళదారిన వాళ్ళు పోయారు.

* * *

సీతమ్మ ఈ లోకాన్ని విడిచి అప్పుడే రెండురోజు లయ్యింది. ఇంతవరకూ రాముడు భోంచేయలేదు.

"ఇలా ఏడుస్తూ కూర్చుంటే మీ అమ్మ వస్తుందటరా? క్రమంగా మరిచిపోవాలి గాని. లేచి కూడు వండుకో" అని హెచ్చరించారు కొందరు. ఇంట్లో బియ్యం లేవని వాళ్ళకేం తెలుసు?

తన పని విషయం జ్ఞాపకం వచ్చింది రాముడికి. వెంటనే బయలుదేరాడు సోమయ్యయింటికి. భయపడ్తూనే ప్రవేశం

(21-వ పేజీ చూడండి)



# పోస్టాఫీసులో

ఆవూరికంతా అదొకటే పెద్ద పోస్టాఫీసు. రోజూ ఉదయం తొమ్మిది గంటలనుంచి, పదకొండు గంటలదాకా, అనేక రకాల ప్రజలు వస్తూ, పోతూ ఉంటే చాల కోలాహలంగా ఉంటుంది. ఒక మూల స్తంభాన్ని ఆనుకొని, అందరిని పరిశీలిస్తూ, వింటూ, ఎంతకాలాన్నయినా క్షణంకింద జమకట్టెయ్యవచ్చు. పొరపాటున వారి భాషణల్లో రహస్యాలుకూడ దొర్లిపోతూ ఉంటాయి. మనసులో ఉంచుకుంటారు గదూ. ఇప్పుడే తొమ్మిది కొవచ్చింది. ఒకొక్కరుగా, జతలుగా, జట్లుగా, జనం పోస్టాఫీసువరండాలోకి వస్తున్నారు.

* * *

ఒకడు: ఏరా, రాజా, యివాళయినా వస్తుందంటావా. నాకు నమ్మకం లేదు. కాని, యీ వాంటెడ్ కాలమ్స్ వాళ్ళు ఉద్యోగా లిస్తారురా...రారా...రాజా. ఎంతవరకు వచ్చింది సార్టింగ్.

మొ: ఉష్...ఉండరా... కొస్త ఊపిరి పీల్చుకోని...వెధవ D. S. P. నా డాల బూటుతో, కసిదీర తొక్కాడు కాలిని.

రెం: ఆ...D. S. P. యా.

మొ: అదేరా...D.S.P. ఆఫీస్ జవాను. ఇంకా బోలెడున్నాయి...రండి... కొస్త కాఫీతాగి వద్దాము.

* * *

రామయ్య: ఏమండోయ్. దాసుగారు యిల్లా దయచేశారు.

దాసు: తెల్లారిలేస్తే యిక్కడికి రాందే గడుస్తుందిటండి ఏమిటి విశేషాలు.

రా: ఏదో ఊళ్ళు తిరిగే వాళ్ళు మీరు చెప్పాలిగాని, కొట్టులో కూర్చునేవాళ్లం యివతలికి రారేమిటండీ యీ పోస్టువాళ్లు. ఉండండి. ఒకసారి చూసివస్తాను. ఎంతలో ఉన్నారో (వెళ్లి.. వచ్చి) అబ్బ...అదో లోకం, ఎంత పిలిచినా వినిపించుకోరు. వినపడదా అంటే కొందరి పిలుపులకి తక్షణం తలతిప్పుతారు...అబ్బ...ఉష్.

రా: మరోగంట ఓపికపడితే వాళ్ళే యివతలికి వస్తారుగదండీ.

దా. అదుర్దా అల్లా అనిపిస్తుందిగాని, నాకుమాత్రం తెలియదండీ.

[శాస్త్రిగారి ప్రవేశం]

శాస్త్రిగారు: రిజిష్టరీ దాఖలా ఎక్కడ చేసికుంటారుబాబూ.

రామయ్య: అదిగో. ఆ ఎదురు కిటికీ దగ్గరికి వెళ్లండి.

శా: ఏమోనాయనా. ఎరుగనివాళ్లం. కొంచెం చేయించిపెడుదూ పుణ్యముంటుంది

## శ్రీ వంగల వేణుగోపాలాచార్య

రెండవ: హారి శకునపక్షీ, చుంచు మొహం చేసికొని చెప్పొచ్చావు జోస్యం

మూడవ: పొద్దున్నే వీడిని వెంటబెట్టుకొని ఎవరు రమ్మన్నారసలు. చుంచు...

మొదటి: ఒరేయ్.సంబాళించుకోరోయ్.

నాల్గవ: అబ్బ. ఊరుకోండర్రా... తెల్లారింది మీకు...ఒరే రాజా...సార్టింగ్ ఎంతవరకు వచ్చిందో చూడరా.

రెం: ఎల్లారా వెళ్ళేది, సినిమా టిక్కట్లకోసంలా జనం మూగిఉంటేను.

మూ: ఇప్పుడు చెప్పరా...చుంచూ... నీ జోస్యం.

మొ: ఉండరా...నేను చూచివస్తాను... (వెడతాడు.)

రెం: కనీసం మొన్న వేసినా యివాళ తప్పకుండా రావాలికదూ.

మూ: ఆ...మొన్న వేస్తే ... ఇవాళ... తప్పకుండా వస్తుంది.

రెం: ఏం వేళాకోళంగా ఉందిరా.

మూ: కాకపోతే. రిజిష్ట్రేషన్ ఫీజు రెండు రూపాయలు పుచ్చుకునేదాకానే

మే మేమిచెప్తాం...అబ్బాయి జాబులు రాస్తున్నాడా...

దా: ఆ తెలివి వాడికుంటే లేనిదేముందండీ. పట్నంలో ఉన్నవాడు జాబులు కూడా రాస్తాడా. ఏదో ఋణం ఉండి, వాడికి నెలకి వందా సమర్పించుకుంటున్నాను.

రా: అదేమిటండీ రేపు అతను సంపాదిస్తే మీకు కాదూ.

దా: రేపు ఏమవుతుందోగాని. వాడు సంపాదించేటప్పటికి ఉన్న ఒక్క యకరం ఎగిరిపోతుందేమో.

రా: పోనిద్దురూ. మనం భూములు సంపాదిస్తాముకాని అవి మనల్ని కొనవు కదా...అయినా ఆ బ్బాయి ఒక చిన్న ఉత్తరంముక్క రాస్తే యింత యిదిగా ఉండకపోను...పోనీలెండి.

దా: ఆ...మన పిచ్చికాకపోతే, అడ్డాలనాడుగాని, గడ్డాలనాడు మనబిడ్డలవుతారుటండీ. ఏదో స్నేహధర్మంగా నడుచుకోవాలి...సరేగాని వీళ్ల దుంపతెగా, ఎంతకీ

రా: సరిసరి. సరాసరి వెళ్లి, ఆయన కిచ్చి, 'రిజిష్టరీబాబూ' అనండి. అయనే చేసికుంటాడు.

శా: తిరుగు రశీదుకూడా కట్టించాలి బాబూ. కొంచెం పుణ్యం కట్టుకోందురూ. పోనీ మీరయినా సరే.

దా: యిల్లాఅయినా కొంత కాలహరణం అవుతుంది. రండి శాస్త్రిగారూ.

శా: దీర్ఘాయురస్తు... సకలైశ్వర్యసిద్ధిరస్తు...పద నాయనా.

దా: ఎవరికండీ యిది... ఊ...సరే... దీనిమీద చేవ్రాలు చేయించండి.

శా: పేరు చూడండి...పురాణపురుషుల పేర్లు పెట్టుకుంటేమాత్రం వాళ్ల ఘనత రావద్దూ...పిడికథలు...పిచ్చిరాతలూ... పీడూ—

దాసు: అదేమిటండోయ్...కథలురాసే ఆయనకా...వీరిపేరు నాకు బాగా తెలుసే ...కాని వీరి కథలుంటాయి చూశారు, చాల ఆదర్శంగా, ఉన్నంతగా ఉంటాయి.

శా: ఆదర్శమట...ఏమిటా ఆదర్శం... ఈ జనులు, ఆశయాలు సోదరులు, ఆలయాలు అంటే ఆదర్శమన్నమాట. అంటే కాని పూర్వుల పవిత్రాన్ని మలినం చేస్తున్నామనే జ్ఞానం ఉండక్కర్లేదా.

దా: కోప్పడకండి శాస్త్రిగారూ. మీరిల్లా అంటే శక్తి, ఆయన అల్లా రాస్తేనే ముక్తి, యింతకే...

శా: మీకూ వాడిజబ్బే ఉంది. కలికాలం. శివశివ. యిక్కడ ఒక్క క్షణం ఉండకూడదు...(వెళ్లి పోతారు)

రా: ఏమండీ. శాస్త్రిగారు ధూకుడుగా వెడుతున్నారే.

దా: బాపయ్య కథలు చదివి ఖంగారు పడుతున్నారు.

రా: (నవ్వుతూ) కథలంటే గుర్తు వచ్చింది. మీవాడు కథలు రాస్తాడుటగా.

దాసు: వాడి మొహం. అదో పిచ్చి ఆవేశం. సరేగాని ముందు మనకథ చూడండి. మనవా డెంతవరకు వచ్చాడు.

రా: ఉత్తరాలయ్యాయి. యిక పత్రికలలో పడ్డాను. రండి ఆ నీడని నిలబడుదాము.

* * *

కాశీ: వెంకయ్యా. నీ పోస్టు అందిందా.

వెంకయ్య: అప్పుడే ఏదిరా. అన్నట్టు నిన్న మీ కచేరీలో ఏదో గలాటా అయిందంటనే.

కాశీ: ఏం గలటారా... అదా...అదే. త్రిమ్యకేసులో సాక్ష్యానికి వచ్చారే వాళ్లే. గుమాస్తాతో తగూలాడారు. పూచీకత్తుల సంగతి నీకు తెలిసిందిగా. కచేరీ అపుచేసేదాకా పోయిందిలే.

వెం: అదా. సరిసరి. అడెదిగోయ్. కొత్త పెన్సుగొన్నావ్. పూచీకత్తులు మరి ఘాటుగ లేవుకదా. అబ్బా బాంకీవారు కొంచెం జరగండి బాబూ. తొక్కిసలాగింకా రాలేదా...అదో. మాటలో వచ్చారు.

సింహాద్రి: ఏరోయ్. మేస్త్రీట్లు ఊసులాడుతున్నారు.

కాశీ: ఒరి నీ దుంపతెగా. యీసారి క్యాంపు చాన్సాళ్లు వేశావే.

సిం: ముందు యీ లోకలుపోస్టు తగలడు. ఏం కొంపులోరా. సానాలు తోడేస్తున్నాయి. గంటలో పూరు. ఘుడియలో పల్లె. ఆఫీసర్లకయితే బెంగలేదు కాని, మనముఖం ఎవడు చూస్తాడురా.

కాశీ: అయినా మీవాడు మరీ కటిక్కోడురా. ఆయనలాగే నువ్వూ సంసారం గట్రా వదలిపోతావుగండా. కొంచెం వనక్కు ముందు చూడొద్దా అంటా.

సిం: ఇంకెంతరా. పదిరోజులు. యీయన్ని ఎత్తేసినారులే.

వెం: సల్లగా చెప్పావు. ఆ వచ్చే దవ్రోయ్.

సిం: ఎవరోగాని కమ్మ్యయనంట. ఇంకెప్పుడూ యీ పోస్టు చచ్చేది. పదిన్నరకల్లా యింటికాడ ఉండకపోతే మనిషి ఉగ్రుడయిపోతాడు.

కాశీ: అదేరా నస్నేమడుగుతావు. పనున్నా లేకున్నా అస్తమానం గేటు గంట గుమ్మంముందు కూర్చోవాలంట్రా. ఇంట్లో ఆడోరు మరీని. గంటగంటకీ బజారు లగెత్తిస్తారు. మళ్లా వర్రోళ్లని బళ్లోదించాలె. యింతా చేసి, ఆఫీసులో వెళ్లు వాయింపగానే హాజరవాలంటరా.

వెం: పోనీరా. కష్టాలన్నీ ఒకయెత్తు. పూచీకత్తులన్నీ ఒకయెత్తు. తగ్గ ఫలం ఉంటే ఎంత కష్టమయితేనేంరా...మన హెల్త్‌ల్లో రాలేదేంరా.

సిం: అదో...ఏయ్ రహీమ్. యిదర్ ఆరే. హీమ్...మహాజోరుగా హెడ్తున్నావ్. పాకీస్తాన్నం రమ్మంది.

రహీం: అరే...మన హమ్మ్యంయ్...అదే ఆఫీసర్ గారి హమ్మాయికి పెండ్లిబే. పెండ్లి.

సిం: అయితే మానోర్కి తీపితెయ్యిబే.

రహీం: మక్కి యింకా నిక్కలేదు భయ్. హేం అయ్యా బాబుగారూ మక్కితపాల్ హిప్పించండీ వయ్యా. క్యా. పావుగంట. హరే హల్లా. హీ స్టే పది అయింది. హింకా హెప్పుడ్ వయ్యా.

ఒక పోస్టుజవాను: ఏమండోయ్. కలక్టరుగారూ యిగుగో... బాంకీవారు.. తాసీల్దారు . టాక్సు... మేస్త్రీటువారు.. జడ్జీ ...D.S.P. హెల్త్‌ళ్లు ఏరయ్యా యిదిగో మీ తపాలు...అబ్బ... ఉండండయ్యా... ఖంగారూ మీరూను...మేమేమున్నా ఆకుకుంటున్నామా...అయ్యా ప్రొహిబిషన్ వారు... పత్రికవారు అబ్బ. అంతా అయ్యారా.. కొంచెం జరగండి... తలుపు వెయ్యాలి.

[కిటికీతలుపు వేసేస్తాడు]

* * *

రాము: పిడి గుంపతెగా...తలుపు వేశేశాడురా. యివతలికి రాకపోయినా వాళ్ల వంక చూస్తుంటే అగోత్సృప్తి...ఒరే శంకరం అవతల కిటికీపక్కకి ఎళ్లి మనవా డేమి చేస్తున్నాడో చూడరా.

శంకరం: వెడితే మాత్రం, అనుగ్రహించవద్దూ.

రాము: ఫరవాలేదు. ఎంతసేపయినా సరే. వాడు నీవయిపు చూడగానే, ఒక్కసారి, 'ఏమంటావ్' అన్నట్టు, రెండు కనుబొమ్మలూ ఎగరెయ్యి. తర్వాత వాడిముఖం పరిశీలనగా చూడు. తర్వాత.

శం: ఏడిసినట్టుంది, నీ సైకాలజీగ్రాఫ్రా నువ్వూను. కనుబొమ్మలేకాదు. చివరికి

మనిషనంతా ఎగిరినా - వాడిలో చలనం అనేది కలుగదు. వాని ముఖంలో నిర్లిప్తత, నిశ్చింత, పట్టుదల మూర్తీభవించి, కించిత్తూ చలనరహితమై, సుప్రశాంతంగా...

రామం: ఆపు నీ విద్వాక్‌గిరి. నేను చెప్పినట్టు చేసి చూడుమరి.

శం: నే చెప్తున్నాగా. మన తపస్సు ఫలించనీ. ఒరే అల్లా చూడు. ఆ బట్టతలాయన రోజూ వస్తాడురా టంచన్‌గా. రోజూ ఏముంటుందిరా పోస్టు.

రా: ఆ...వచ్చేవాళ్లందరికీ...ముహూ... ఉన్నాయిటరా.

శం: కాదురా. రోజూ వస్తుంటే...

రా: అదేరా. ఒకరకం జబ్బు. లేక అలవాటు. మన శరీరాన్నయినా సరే, బలవంతంగా కొన్ని అలవాట్లు చెయ్యి. కాలక్రమేణ అవి చేసేదాకా దానికి తోచదు. యింతకీ అసలు...

శం: అపరోయ్...నాయినా... ఎరక్కపోయి అడిగాను. యింతకీ మనకి సంచిక వస్తుందంటావా.

రా: ఆ...నువ్వు పంపింది వేసికుంటే... నిక్షేపంలా వస్తుంది.

శం: నీ మొహం. వేసికుంటే పంపకేం చేస్తాడురా. అంటే... వేసికుంటాడా అని నా భావం.

రా: నీ మొహంలా ఉంది. వేసికున్నా పంపనివాళ్ళు కోటిమంది. అసలు ఈ తత్వాలకి మూలం అహంభావం. అహంభావం అంటే గర్వమే కాక యింకా చాలా అర్థాలున్నాయి. ఉన్న నలుగురిలోకి తనే గొప్పవాడి ననుకొన్నప్పుడే యిల్లాంటివి...

శం: తగులపడినట్టుంది తత్వపరిశోధన. ఎరక్కపోయి నీకీ గ్రూపు యిచ్చారురా. మనవాడింకా ఏం చేస్తున్నాడో... అదిగో తలుపు తెరిచాడు...చూడు...

రా: ఇంకా మనియార్డరు తీసికోవాలి. రిజిస్టరీలు తీసికోవాలి. యింకో అరగంట తపస్సు చెయ్యవచ్చు...అబ్బా డొక్కలో పొడిచాడు...ఎవర్రా అంత ఘాటుగా పోతుంట.

శం: పోనీరా. టెలిగ్రాఫ్ కౌంటర్ వయిపు వస్తున్నాడు. అదొక అద్భుత తత్వం. కొంత ఖంగారుకూడ మిళితమయి ఉండవచ్చు. అయినాకూడా...

రా: మండినట్టుంది నీ రిసెర్చి. డొక్క మాడిపోతేను...ఉష్...కొస్త వరండా చివర నిలబడదాంరా. అన్నట్టు శాంత దగ్గరనుంచి నిన్న జాబు వచ్చిందిరా.

శం: వచ్చిందీ...ఏమిటి విశేషాలు.

రా: తండ్రి వేరే సంబంధం చూశాడుట. చాల పట్టుదలగా ఉన్నాడుట.

శం: తల్లికి నువ్వంటే యిష్టమేకదరా మరి.

రా: అయితేమాత్రం మొగుడిసెలా కాదంటుందిరా.

శం: ముహూర్తంకూడ పెట్టేశారా.

రా: అంతదాకా యింకా రాలేదు. కాని వాకటి తోస్తోందిరా.

శం: ఏమిటది. ఎదో కొంపకూల్చావన్నమాటే.

రా: ముందు మనకొంప గట్టిగా ఉండద్దూ.

శం: అసలుసంగతి ఏమిటి యింతకీ.

రా: ఆ పెళ్లికొడుకు నాగపూరులో చదువుతున్నాడుట. ఎడ్రసుకూడ రాసింది. మనం ఒక ఆకాశరామన్న జాబు రాస్తే.

శం: ఉభయులకీ యిష్టం. తల్లికీ యిష్టం. అదే కల్సివస్తుంది. 'శుభస్యశీఘ్రం' కానియ్యిమరి. అదిగో...వెండరుకూడ యివాళ రయిట్ టయిమ్‌కే వచ్చాడురా. కవరు కొందాం.

రా: యింతలో మనవాడు జారుకుంటే.

శం: ఏడిశాడు. అంత త్వరగా వాడు వెళ్ళకలిగితే యీపాటికే మనకి ఆంధ్ర రాష్ట్రం వచ్చిఉండేది. సరు...సరు...

* * *

సరిగ్గా పదకొండు గంటలకి, ఒక్కొక్క పోస్టు జవానే. మోగసింగా, యువతలికి రావడమూ, వచ్చినవాడు తను ఊటువాడు కాకపోవడంతో, కదలిన జనప్రవాహంలో కొంత నిరుత్సాహులై ఆగిపోవడమూ, మళ్లీ కదలడమూ, ఫలితంగా, ఒక్కొక్క పోస్టు జవాను, వెంటబడ్డ ఒక్కొక్క గుంపుతో సహా, పోస్టాఫీసు ప్రక్కనేఉన్న సత్రపు టుగురుపయి విశ్రమించి, తాపీగా జాబులందివ్వడంలో లీనమయిపోతాడు. 

# అన్యాయం

18-వ పేజీ తరువాయి)

చాడు లోనికి. సోమయ్యను చూడగానే కంపించి పోయాడు.

"ఏం? ఇలా వచ్చే వెందుకు?" ప్రశ్నించాడు సోమయ్య.

"పనికి బాబూ..."

అతని సమాధానం పూర్తికాకముందే,

"అక్కర్లేదు. ఇంకొకడ్ని పెట్టుకున్నాం. నీ ఇష్టమొచ్చినప్పుడు వస్తే, నీకోసం కాచుక్కూర్చుంటా మనుకున్నావా?" అన్నాడు సోమయ్య.

"మా అమ్మ చనిపోయిందండీ" కళ్ళలో నీళ్ళు తిరిగాయి రాముడికి. ఇంకేమీ చెప్పలేకపోయాడు. కొంచెంసేపు నిశ్శబ్దం.

"ఇదుగో, చూడూ, ఇంకేమీ లాభం లేదు. నీబదు లింకొకడ్ని పెట్టుకున్నాం. ఇంకెక్కడయినా చూసుకోపో." సావధానంగా చెప్పాడు సోమయ్య.

"రక్షించాలి బాబూ! మీ రలాగంటే బ్రతకలేను. దిక్కులేనివాడ్ని" దీనంగా ప్రార్థించాడు రాముడు.

"ఇదిగో! నీ క్కాదూ, చెప్పేది?" అధికార పూర్వకంగా గర్జించాడు సోమయ్య.

"పోనీ, నాకు రావలసిన జీతం యిప్పించండి."

"ఏడిశావ్! నీకు జీతం ఏంటి? ఇవ్వవలసిందంతా ఇచ్చేశాను. మర్యాదగా యింటికి నడు."

"ఇంత న్యాయమా బాబూ!

"మర్యాదగా పోతావా గెంటించాలా."

వెనక్కి తిరిగాడు రాముడు. తనకున్న ఆధారం కాస్తా పోయింది. పదహారు సంవత్సరాల్లో తన కంటిపాపగావున్న తల్లి కూడా లేదు. ఇక తనేమైతే ఎవరిక్కావాలి. లోకం అంతా అంధకారం. అంతా అన్యాయం. బహిరంగ దోపిడి. ఇన్ని న్యాయస్థానాలున్నై. ఏం లాభం? తనొక్కడికి న్యాయం జరిగించలేవు. చావన్నా రాదు. అదికూడా అదృష్టవంతులకే వస్తుంది. తన దుస్థితితో ప్రపంచానికేం సంబంధం? తన దారిని తాను సాగిపోతూంది కాలం. అడుగుల్లో అడుగులు వేసుకుంటూ తన గుడిసె చేరుకున్నాడు రాముడు. ఇంట్లో మాత్రం ఏముంది? అంతా శూన్యం. తన కింక గుడిసెతో పని లేదు. ఏం చేసుకుంటాడు. దీర్ఘంగా నిట్టూర్చి ఒక మూల చతికిల పడ్డాడు. ఏమీ తోచలేదు. అకస్మాత్తుగా లేచాడు. బయటికి వచ్చేశాడు. గబగబా స్మశానానికి నడిచాడు. తల్లి సమాధివైపు నడిచాడు. అక్కడ మాత్రం ఏముంది? సమాధి ప్రక్కనే కూర్చున్నాడు. తీవ్రంగా ఆలోచింపసాగాడు. చుట్టుప్రక్కల పక్షుల శబ్దాలు వినపడుతున్నై. వాటిష్టం వచ్చినట్టు గాలిలో ఎగురుతూ ఆడుస్తున్నై. కొంతసేపటి కక్కడే వెల్లకిలా పడుకున్నాడు. ఎండ తీవ్రంగా కాస్తోంది. చుట్టూ పరికించాడు. ఆవిశాల[illegible]శంలో నున్న జీవరాసులన్నీ సంతోషంగానే వున్నై. అక్కడ తానొక్కడే విచారంగా వుంది. ఒక పక్షిజన్మ మెత్తినా, తన కా విచారం వుండేదికాదు. జరిగిపోయిందంతా అతని కళ్ళకు కట్టినట్టు కనిపిస్తూంది. సూన్యాకాశంలోకి చూస్తూ అలాగే వుండి పోయాడు రాముడు. 

# పాఠకుల అభిప్రాయాలు

[మా సచిత్ర వారపత్రిక కొద్దిమాసాలుగా గడించిన అపూర్వ ప్రజాదరణ ఫలితంగా వారం వారం ప్రచురించబడే వ్యాసాలను గురించి పాఠకులు తమ అభిప్రాయాలను ఆసక్తితో పంపుతున్నారు. ఈ అభిప్రాయాలవల్ల మాకేగాక ఇతర పాఠకులకూ, రచయితలకూ ప్రయోజనం ఉండగలందులకు ఈ శీర్షిక ప్రారంభిస్తున్నాము. ఈ శీర్షికలో సహేతుక, నిష్పాక్షిక అభిప్రాయాలకు మాత్రమే తావుంటుంది—సం.]

—

ఆర్యా,

శ్రీమతి మాలతీ చందూర్ వ్రాసిన కథ "పణ్యగం" [10-10-51] రసవంతంగా ఉంది... శ్రీ నండూరి రామమోహనరావు గారికీ, శ్రీమతి మాలతీ చందూర్‌కీ నా అభినందనలు ... రామమోహనరావు గారు అనువదించిన "రాజూ-పేదా" అంత రసవంతంగా "కాంచనద్వీపం" లేదనక తప్పదు. అయినా చక్కగా ఉంది.

శ్రీ అకుండి నారాయణ మూర్తిగారి రచనలు ప్రచురింపబడుతున్నంత మటుకు చక్కగా ఉండి పాఠకుల హృదయాలను కదిపి, కొన్ని చిత్రాలనూ మన స్తత్వాలనూ అందివ్వగలుగుతున్నాయి. "నాబండీ" [17-10-51]—ప్రతీ ఒక్క పాఠకుడి హృదయం కదిపుంటుందనుకుంటున్నాను. ఆయనకు నా ప్రత్యేక అభినందనలు.

సాలూరు
22-10-51 } కె. రామకృష్ణ

—

ఆర్యా,

యీ అశాంతి వాతావరణంలో మీ వారపత్రిక సమన్వయానికీ సక్రమ దృక్పథానికీ దోహదం చేయగలదని మా భావన. మీ పత్రికలో ప్రచారమే పరమార్థముగా భావించక, భారతీయుల సాంఘిక కళాత్మికాభివృద్ధులకు చేయూతనిచ్చు రచనలు ప్రచురించబడడం ఎన్నదగినది. సంఘర్షణా, అసహనభావం ప్రధానమైన యీ రోజులలో మీ పత్రిక భారత సంయుక్త రాష్ట్రియుల సామరస్య భావానికీ, అభివృద్ధికీ కృషిచేసి ఆదర్శంగా ఉండగలదని భావిస్తున్నాం.

కడిరి,
21-10-51 } బసిరెడ్డి ఈశ్వరరెడ్డి,
తాలూకా ప్రోగ్రెసివ్
కాంగ్రెస్ పార్టీ.

—

ఆర్యా,

ప్రతివారము ఆంధ్రపత్రికకై ఎదురెదురు చూచుచున్నాము ... ముఖ్యముగా బొమ్మరిల్లు ప్రత్యేకముగా ఎన్నదగియున్నది. ఈ వారములోని (24-10-51) "ఎత్తుకుపైఎత్తు" అనుకవి రావుగారి గేయకథ చాలా బాగాయున్నది. వారివి లోగడ ప్రకటించిన గేయకథలన్నియుగూడ యతిప్రాసలు చెడకుండ ముద్దులొలుకునట్లు పసిపాపలకు అనువగు నడకతో చాలా బాగున్నవి. కాంచనద్వీపము బాగున్నది. చదివినకొలది చవులూరించుచున్నది... కథానికలు చాలా బాగుంటూ యున్నవి...

గుంటూరు
25-10-51 } ఎమ్. ఇందిరాదేవి.




# ప్రత్యుపకారం

శ్రీ జి. వి. ఆర్. కామేశ్వరశర్మ

గంగానది తీరానొక
మఱ్ఱిచెట్టు ఉండెను.
ఒక్క పావురంబుదాని
పై, వసించు చుండెను.

చీమయొకటి కాలుజారి
నీటిలో పడిపోయెను.
ప్రయత్నించికూడ దరికి
చేర లేకపోయెను.

దీనినంత చూచుచున్న
పావురంబు వెంటనే
ఒక్క ఆకు త్రుంచినీటి
లోన జారవిడిచెను.

ఆకువలన చీమతిరిగి
ఒడ్డు చేరగల్గెను.
ప్రత్యుపకారంబు కొరకు
ఎదురు చూచు చుండెను.

అంతనొక్కనాడు వేట
కాడొకండు వచ్చెను.
పావురాన్ని చూచి మదిలో
చాల సంతసించెను.

"ఇంపగు భోజనముదొరికె"
నంచు సతము తలచెను.
విల్లు నెక్కుపెట్టి మంచి
గురి కుదుర్చుకొనియెను.

తరిమించిన దనుచు చీమ
వేటకాని కుట్టెను.
బాణపుగురి తప్పిపోవ
పావురమ్ము ఎగిరెను.

ఉపకారికి నుపకారము
చేయుటె మన ధర్మము.
ప్రత్యుపకారంబు కంటె
నెక్కువేది కలదిలన్.





ముళ్లపంది

## ముళ్లపంది

దక్షిణ ఇండియా అరణ్యాల్లో తరుచు కనిపిస్తుంది. సింధు, బలూచిస్థాన్ లలో కూడా నివసిస్తుంది. ఎలుకలు, ఉడతలు మొదలైనవాటివలె దీనికి బలమైన దంతాలున్నాయి. దీనికి తెల్లగా బాణాలవలె ఉండే ముళ్లున్నాయి వంటినిండా. శత్రువు దగ్గిరికి వచ్చినప్పుడు ఈ బాణాలను వాటిపై విసురుతుందని ఒక నమ్మకం వుండేది ఇదివరలో. కాని అది నిజం కాదు. అసలు ఇది పిరికిజంతువు. ఏమీ హాని చెయ్యదు. కాని ఏ జంతువైనా ఎదుర్కొంటే ముళ్లను విసన

## హిమాలయపు ఎలుగు

ఈ ఎలుగుబంటి హిమాలయ పర్వతారణ్యాలలో కనిపిస్తుంది. అఫ్ఘనిస్థాన్‌లో కొన్ని భాగాల్లోను, బలూచిస్థాన్, సింధురాష్ట్ర ప్రాంతాల్లోనుకూడా ఈజంతువునివసిస్తుంది. ఇతర నల్ల ఎలుగులకు దీనికీ ముందుగా కనిపించే తేడా ఏమిటంటే, దీనికి మెడకింద రొమ్ము మీద 'V' ఆకారంలో తెల్లటి గుర్తుంటుంది. ఈ ఎలుగు పరిమాణం కూడా పెద్దది. దీన్ని మాలిమి చెయ్యటంకూడా తేలిక. చెట్లెక్కడం, దిగడం దీనికి పుట్టుకతో వచ్చిన విద్య. మిగతా వాటివలె కాకుండా ఇది తోక కిందకి, తల పైకి పెట్టి దిగుతుంది. ఇది 14 నుండి 35 ఏళ్ల వరకూ బతకగలదు. గంటకి 28 మైళ్లు పరిగెత్తగలదు. గర్భధారణ కాలం 8 నెలలు.



ఎలుగుబంటి

కత్ర లాగా విప్పి తన్ను తాను రక్షించుకుంటుంది. 8 నుండి 17 ఏళ్ల వరకూ జీవించగలదు. పదిమైళ్ల వేగంతో పరిగెత్తగలదు. గర్భధారణకాలం 2 నెలలుపైచిలుకు.

## గోరిల్లా

మనుష్యుల మోస్తరుగా ఉండే కోతులకు చెందిన ఈజంతువు పశ్చిమాఫ్రికా అరణ్యాల్లో నివసిస్తుంది. ఆఫ్రికాలోనే తూర్పు బెల్జియన్ కాంగోలో మరోమాదిరి గోరిల్లా ఉంది. గోరిల్లాలు చింపన్‌జీ మోస్తరు జంతువులైనా వాటికంటే ఆకారంలోను బరువులోను పెద్దవి. మగగోరిల్లాలు నుంచుంటే $5\frac{1}{2}$ అడుగుల ఎత్తుంటాయి. 100పౌనుల పైగా



ముళ్లపంది (వెనుకనుండి)



గోరిల్లా (రాతిప్రతిమ)

బరువుంటాయి. ముఖం నల్లగా, ముడతలుపడి వుంటుంది. గోరిల్లాలు దట్టమైన కీకారణ్యాలలో, కుటుంబాలుగా నివసిస్తాయి. పళ్లు, కాయలు, కందమూలాలు తింటాయి. అప్పుడప్పుడు మానవ నివాస ప్రాంతాలకు వచ్చి తోటలపై దాడిచేస్తాయి. చెట్లపైన పడుకొనేందుకు ఇళ్లు కట్టుకుంటాయి. మగగోరిల్లా చాల బరువైందికనుక నేల మీదే ఉంటుంది. పైనఇళ్లలోఆడగోరిల్లాలు, శిశుగోరిల్లాలు నిద్రిస్తాయి. నేల మీద కూడా ఇవి ఆమాదిరి ఇళ్లు కట్టుకుంటాయని చెబుతారు. సాధారణంగా ఇవి మనుష్యుని జోలికి రావు. ఆగ్రహిస్తే మాత్రం వీటిధాటికి ఎందరు మనుష్యులైనా చాలరు. ఇవి సింహాలకంటే బలశౌర్యాలుకల జంతువులనీ, తలుచుకుంటే సింహాలను కట్టెపుల్లలు విరిచినట్లు రెండు చేతులతో ఎత్తి విరిచెయ్యగలవనీ చెబుతారు. వీటికొక తమాషా అలవాటుంది. కోపంలో వున్నప్పుడు రెండు చేతులతో రొమ్ముమీద తపతప బాదుకుంటాయి. వీటిని ఖైదు చేసి సింహాలవలె ఉంచటం కష్టం. మిగతా జంతువులవలె ఇవి బోను జీవితానికి అలవాటు పడలేవు. కొద్దికాలంలో నీరసించి చనిపోతాయి. కొందరు శాస్త్రజ్ఞులు పరిశోధనలుచేసి గోరిల్లాలకు మిగతా జంతువులకంటె ఎక్కువగా తెలివితేటలు, జ్ఞాపకశక్తి, అనుభవజ్ఞానం ఉన్నట్లు కనిపెట్టారు. కాని వీటికంటె చింపన్‌జీ, ఉరాంగ్ ఉటాంగ్ జాతులకు తెలివితేటలెక్కువట.






(బొమ్మలు వాల్ట్ డిస్నీ ప్రొడక్షన్స్, ఆర్. కె. ఓ. రేడియోవారి సౌజన్యంతో)

**జరిగినకథ :**

మాకు బ్రిస్టల్ నగరసమీపంలో ఒక హోటల్ ఉంది. ఒకరోజున మా హోటలుకు 'బిల్' అనే సముద్రపుదొంగ తనతోటి దొంగలనుండి తప్పించుకుని పారిపోయివచ్చాడు. అతడు మా హోటల్లో ఉన్నాడని మిగతా దొంగలకు తెలిసి, అతన్ని చంపేస్తామని బెదిరించారు. అతడు ఆ బెదిరింపుకే భయపడి చనిపోయాడు. అతడు మాకు కొంత డబ్బు బాకీ ఉన్నందున మా అమ్మ, నేను అతనిపెట్టె తెరిచి కొంత డబ్బు, ఒక వింతపార్సెలు తీసుకుని సముద్రపు దొంగలనుండి తప్పించుకుని పక్కగ్రామానికి పారిపోయాము. పార్సెలును మా డాక్టరుగారికి, జమీందారుగారికి చూపాను. దాన్ని తెరిచిచూడగా కాంచనద్వీపపటం కనిపించింది. వెంటనే అక్కడి ధననిక్షేపాలు సంపాదించే ఆశతో అక్కడికి ప్రయాణమయ్యాము. జమీందారుగారొక ఓడను సిద్ధం చేశారు. స్మాలెట్ అనే అతన్ని కెప్టెనుగాను, లాంగ్ జాన్ సిల్వర్ అనే వాణ్ణి వంటవాడుగాను కుదిర్చారు. సిల్వర్ అసలు సముద్రపు దొంగల్లో వాడే అయినందున, మిగతా కళాసులందరితో కలిసి మమ్మల్ని చంపడానికి పెద్దకుట్ర పన్నాడు. ఆకుట్ర నెదుర్కోటానికి మేము ఎదురు సన్నాహాలు చేసుకున్నాం. ఇంతలో కాంచనద్వీపం చేరాము. నేను ద్వీపం చూట్టానికి ఒంటరిగా బయల్దేరాను. ఇక చదవండి.

## 14. మొదటి హత్య.

సిల్వర్‌ను తప్పించుకొని రాగలిగినందుకు గర్వ పడుతూ ఒక చెట్టుకింద ఆగి నలుప్రక్కలా పరీక్షగా చూశాను. సముద్ర తీరంనుండి కొంతదూరం దాకా అంతా బురదనేల. బురదలో పెరిగేచెట్లు, పొదలు అన్నీ దాటివచ్చాను. నేను నుంచున్నచోట పొడిఇసుక వున్నది. ఆ ప్రదేశంలో ఉన్నతమైన దేవదారు వృక్షాలు, సిందూర వృక్షాలు గుబురుగా పెరిగి వున్నాయి.

ద్వీపాన్నంతా పరిశోధించాలనే కుతూహలం కలిగింది. అంతా నిర్జనంగా ఉన్నట్లు తోచింది. నోరులేని జంతువులు, పక్షులు మాత్రమే కనిపిస్తున్నాయి. మళ్లీ కొంతదూరం నడిచాను. ఏవో పువ్వుల మొక్కలు కనిపించాయి. అవేమి పువ్వులో తెలియలేదు. వాటి సందులనుండి పాకుతూ కొన్ని చిన్న చిన్న పాములుకూడా కనిపించాయి. ఒకపాము తల ఎత్తి నావంకచూసి బుస్సుమంది—ఈకొత్త వాడిక్కడికెందు కొచ్చాడన్నట్లు. నాకప్పుడు తెలియలేదు, అది అపాయకరమైన పామని. తరవాత తెలిసింది అది కట్ల పామని.

చెట్ల వెనుకగా కనిపిస్తున్న టెలిస్కోప్ కొండ వంక చూస్తూనుంచున్నాను. ఇంతలో నావెనక చెట్లమీది పక్షులన్నీ గోలచేస్తూ ఒక్కసారిగా ఎగిరాయి. కళాసీలు ఒడ్డుచేరుకుని ద్వీపంలోకి వస్తున్నారని గ్రహించాను. కొంతసేపటికి మాటలుకూడా వినిపించసాగాయి. మాటలు క్రమంగా బిగ్గరిగా, దగ్గరిగా వినిపిస్తున్నాయి.

నాకు భయంవేసింది. శత్రువులకు కనిపించకుండా దగ్గర్లోఉన్న ఒక లావాటి చెట్టుచాటున నక్కికూర్చున్నాను. మాటలు బాగా సమీపంలో వినిపిస్తున్నాయి. ఒక కంఠం సిల్వర్‌దని గుర్తుపట్టాను. తీవ్రంగా, క్రోధంతో మాట్లాడుతున్నాడు. రెండో కంఠం నెమ్మదిగా, కొద్దిగా భయపడుతున్నట్లుంది. చివరికి వాళ్లొకచోట కూర్చున్నట్లున్నారు. ఎందుకంటే వాళ్ల మాటలు కాస్సేపు ఆగిపోయాయి. పక్షులుకూడా చెట్లమీద తిరిగి సర్దుకున్నాయి. అందుచేత నేను ధైర్యంచేసి మెల్లిగాపాకుతూ వారినిసమీపించి ఇంకొక చెట్టుచాటున నక్కాను. అక్కడినించి సిల్వర్, అతని అనుచరుడూ శుభ్రంగా కనిపిస్తున్నారు. నేను మాత్రం వారికి కనిపించకుండా జాగ్రత్త పడ్డాను.

సిల్వర్ టోపీతీసి కిందపడేశాడు. అనుచరుణ్ణి చూస్తూ ఇలాగన్నాడు.

అనువాదం : శ్రీ నండూరి రామమోహనరావు

"టామ్! నువ్వంటే నాకు మొదట్నుంచీ యిష్టం. నీమంచి కోసమే నేను చెప్పేది. నీ తల కాపాడాలనే నేను తంటాలు పడుతున్నాను. నువ్వు ఒప్పుకోకపోతే వాళ్లని ఊరుకోబెట్టటం కష్టం. అసలు నిన్ను ఒప్పిస్తానని చెబుతూ ఇంతవరకూ వాళ్లని ఆపుతూ వచ్చాను. చెప్పు. ఆఖరిసారిగా అడుగుతున్నాను. మాలో కలుస్తావా? కలవ్వా?"

రెండోవాడన్నాడు: "సిల్వర్! నువ్వు అందరిలోకి పెద్దవాడివి. గౌరవంగా బతికినవాడివి. నీకు కావలసినంత డబ్బు, మాఅందరి దగ్గిరఉన్న దానికంటె ఇరవై రెట్లుఉంది. నీధైర్యంలో పదోవంతుకూడా మాలో ఎవరికీ లేదు. నువ్వుకూడా ఆ వెధవల్లోచేరి ఇంత నీచానికి ఒడిగడతావా? తప్పుకాదట్రా?"

ఇంతలో దూరాన మళ్ళీ పక్షులన్నీ ఒక్కసారిగా ఎగిరాయి. ఒకపెద్దకేక, తరవాత చచ్చిపోతూన్న మనిషి ఎవరో దారుణమైన బాధతో మూలుగుతున్నట్లు వినిపించింది.

ఈశబ్దాలకు టామ్ భయంతో కంపిస్తూ ఒక్కఉదుటున లేచాడు. సిల్వర్ కూడా ఒక్క ఊపుతో లేచాడు. చంకలో ఊతకర్ర పెట్టుకుని కప్పపైకి దూకసిద్ధంగా ఉన్న తాచుపామువలె కనిపించాడు.

"సిల్వర్!" అని అరిచాడు. టామ్.

"చేతులెత్తుపైకి," అని భయంకరంగా గర్జించాడు సిల్వర్. ఆ గర్జనకు టామ్‌కంటే నేనే ఎక్కువగా వణికిపోయాను.

"చేతులెత్తుతాను, కాని, నన్ను చంపడంవల్ల నీకేమిలాభం, సిల్వర్? నేను అమాయకుణ్ణని నీకు తెలియదా? నేనేమీ మాట్లాడను. మీయిష్టం వచ్చినట్లు చేసుకోండి మీరు. నేనుమాత్రం మీలో కలవను. ఇప్పుడు ఎవరూ అరిచింది? చెప్పుసిల్వర్!"

టామ్‌ను ఒక్కక్షణంకూడా విడవకుండా గమనిస్తున్నాడు సిల్వర్. సమాధానం చెప్పాడు: "వాడా? ఎలాన్ అనుకుంటాను."

"ఎలాన్‌గాడా? వాణ్ణి చంపేశారా? అంత మంచివాణ్ణి, చంపేశారా?" అని ఏడుపు గొంతుకతో అన్నాడు టామ్. "సిల్వర్! నువ్వూ, నేను ఇరవై ఏళ్లనుంచీ స్నేహితులంగా ఉన్నాం. ఇక నీకూ నాకూ సరి. నన్ను చంపాలనుంటే చంపెయ్. కాని నేను మాత్రం అంత పాపానికి ఒడిగట్టను."

ఇలా అంటూ టామ్ వెనక్కితిరిగి ధైర్యంగా సముద్రపు టొడ్డుకు అడుగులు వేయసాగాడు. అయిదారు అడుగులు వేశాడో లేదో సిల్వర్ బెల్టులోంచి అతివేగంగా పిస్టలుతీసి టామ్‌కేసి గురిపెట్టి పేల్చాడు. "ఆ—" అంటూ టామ్ కుప్పకూలినట్లు కూలిపోయాడు. సిల్వర్ మరుక్షణంలో మెరుపు మెరిసినట్లు మెరిసి ఊతకర్రను వదిలేసి టామ్ మీదికి దూకాడు. బొడ్డులోనుండి చాకుతీసి టామ్‌ను కసితీరా పోట్లు పొడిచాడు.

తరవాతేమి జరిగిందో నాకు తెలియదు. ఈ ఘోరదృశ్యం చూసి స్పృహతప్పి ఒరిగిపోయాను



సిల్వర్ జేబులోంచి అతివేగంగా పిస్తలుతీసి టామ్‌కేసి గురిపెట్టి పేల్చాడు.

మళ్ళీ లేచేసరికి సిల్వర్ ఇంకా అక్కడే వున్నాడు. ఎదురుగా టామ్ శవం నెత్తురు వరదల్లో తేలుతోంది. సిల్వర్ తన బాకుపై నెత్తురు తుడుచు కుంటున్నాడు. తక్కిన ప్రకృతిఅంతా ఎప్పటిలాగే వున్నది. చల్లటి గాలి వీస్తోంది. చెట్లఆకులు రొదచేస్తున్నాయి. ఆ ప్రశాంత ప్రకృతిలో అక్కడ ఒకమనిషి హత్య చెయ్య బడ్డాడనేందుకు ఎదురుగా శవంతప్ప మరే నిదర్శనమూ లేదు.

సిల్వర్ తరవాత జేబులోంచి విజిల్‌తీసి చాల సార్లు, రకరకాలుగా ఊదాడు. ఎందుకు ఊదాడో తెలియలేదు కాని మళ్ళీ నన్ను భయం ఆవేశించింది. బహుశా దూరానున్న సిల్వర్ మిత్రులు అందరూ బిలబిలమంటూ అక్కడికి రావచ్చు. నన్ను చూశా రంటే ఏం జరుగుతుంది? ఏం జరుగుతుందో నాకళ్ళారా చూడనే చూశాను. వాళ్ల కుట్రలో కలవనందుకు ఇద్దరు కళాసీలు—ఎలాన్, టామ్, ఇద్దరూ దారుణంగా వధించ బడ్డారు. నన్నుమాత్రం చంపరని నమ్మక మేమిటి?

మళ్ళీ వచ్చినదారినే పాకిపోయాను. ఎక్కడా శబ్దం కాకుండా, సాధ్యమైనంత వేగంగా నేను మొదట్లో ఆగిన చెట్టువరకూ పాకాను. తరవాత లేచి కాలికొద్దీ పరిగెత్తాను. ఎటుపోతున్నదీ కూడా గమనించకుండా, ఎంతదూరం వచ్చిందీకూడా చూడ కుండా పరిగెత్తాను.

మళ్ళీ వెనక్కి వెళ్లడం అసంభవం. కెప్టెన్ స్మాలెట్ సూర్యాస్తమయానికి ముందు తుపాకీ పేలుస్తా నన్నాడు. కాని నేను హిస్పానియోలాను చేరుకోవడ మెల్లా? బోట్లు శత్రువుల స్వాధీనంలో ఉన్నాయి. అసలు నేను ఓడను విడిచి వీళ్ళతో ఎందుకు రావాలి? వచ్చినందుకు తగిన శాస్తిజరిగింది. ఇక ఓడలోకి వెళ్ల గలగటం కలలోమాట. గుడ్‌బై హిస్పానియోలా! గుడ్‌బై డాక్టర్ లివ్‌సే! మిత్రులందరికీ గుడ్‌బై. ఇక నేను ఈనిర్జన ద్వీపంలోనే శాశ్వతంగా సంచరించా లేమో.

ఇలా ఆలోచిస్తూ ఇంతసేపూ పరిగెత్తుతూనే వున్నాను. ముందు విశాలమైన మైదానం వున్నది. దేవదారుచెట్లు, సిందూరపుచెట్లు వెనకాలంత దట్టంగా లేవు. కాని బాగా ఎత్తుగావున్నాయి. గాలికూడా సముద్రతీరాన వున్నట్టుకాక నిర్మలంగా, హాయిగా ఉన్నది.

కాని మళ్లీ కొత్తఅపాయం ఎదురుపడింది. మళ్ళీ కాళ్లకు సంకెళ్లు పడినట్లు ఆగవలసి వచ్చింది.

## 15. అడవిమనిషి.

వందగజాల దూరంలో ఒకచిన్న కొండవున్నది. హఠాత్తుగా దాని శిఖరంనుండి రాళ్లు, రప్పలు దొర్లటం ప్రారంభించాయి. ఆశబ్దానికి అప్రయత్నంగా అటువైపు దృష్టిసారించాను. కొంతసేపటికి ఒక ఆకారం శిఖరంమీద కనబడింది. అతివేగంగా ఎగురుతూ గెంతుతూ కిందకివస్తోంది. అది ఎలుగుబంటో, కొండ ముచ్చో, మరే ఇతరజంతువో తెలియలేదు. ఆకారం మటుకు అతి వికృతంగా ఉన్నది. దాన్నిచూసీ చూడ గానే భయంతో ఒళ్లు బిగుసుకు పోయినట్లు ఆగి పోయాను.

వెనక్కి పోవటానికిగాని, ముందుకు పోవటానికి గాని కాళ్లాడలేదు. వెనకవేపు తెలిసిన శత్రువులు, ముందువేపు తెలియని శత్రువు—వెనకగొయ్యి, ముందు నుయ్యిగా తయారైంది నాపని. కాని చివరికి తెగించాను. తెలియని ఈ వింతజంతువు నెదుర్కోవటం

కంటె సిల్వర్ దగ్గిరికిపోవటమే మంచిదని పించింది. వెంటనే వెనక్కితిరిగి పరిగెత్తసాగాను. ఇరవై గజాలు పరిగెత్తానో లేదో, ఆవింత జంతువు ఏదారినవచ్చిందో ఏమోగాని నాఎదురుగా మళ్లీ కనబడింది. కాని ఈసారి స్పష్టంగా తెలిసింది, అది జంతువుకాదని, మనిషేనని. మనిషని తెలిసినంత మాత్రాన నాభయం తగ్గలేదు. ఇలాంటి నిర్జనద్వీపాల్లో మనుష్యుల్ని తల బద్దలుగొట్టి పీక్కుతినే వాళ్లుంటారని వినిఉండటంచేత ఇక ఎల్లాగూ చావుతప్పదని గుండె రాయిచేసుకుని నుంచున్నాను.

అడవిమనిషి నేనాగటంతోనే తనూ ఆగాడు. సందేహిస్తూ రెండడుగులు వేశాడు. మళ్లీ ఆగాడు. మళ్ళీకదిలి మళ్ళీ ఆగాడు. నాకు ఆశ్చర్యంవేసింది. నాలాంటి చిన్న కుర్రవాడినిచూసి ఈఅడవి మనిషి ఎందుకిల్లా జంకుతున్నాడని. చివరికి అతడు రెండు చేతులూ పైకెత్తి మోకరించాడు.

నేను అతన్ని సమీపించాను. "ఎవరునువ్వు?" అని అడిగాను.

"బెన్ గన్" అన్నాడు. అతని కంఠం తుప్పుపట్టిన గొలుసులు గరగర మన్నట్లు, కఠోరంగా, అసహ్యంగా వినిపించింది. "బెన్ గన్ అంటారుసార్ నన్ను. నేను బెన్ గన్నండి నేను." మాటలకోసం తడుముకుంటున్నట్లు, నాలిక స్వాధీనంలో లేనట్లు అనిపించింది. "నాపేరు బెన్ గన్ అండి. మూడేళ్లనుండి మనుష్యుల్తో మాట్లాళ్లేదండి."

ఎండకు కమిలిపోయివున్నా అతని శరీరవర్ణం తెల్లగానేవుంది. ఇంగ్లీషువాడేనని గ్రహించాను. పెదవులుమాత్రం నల్లగా మాడిపోయి ఉన్నాయి. జుట్టు, గడ్డం, మీసాలు తెల్లగా పండిపోయాయి. తెరచాప గుడ్డలే కట్టుకున్నాడు. అవైనా తెగమాసి, చిరిగి వున్నాయి.

"మూడేళ్లా?" అని ఆశ్చర్యపోయాను. "ఇక్కడికెల్లావచ్చావ్? ఏదన్నా ఓడమునిగి యిక్కడికి చేరుకున్నావా?"

"లేదండి. ఇక్కడ వదిలేశారండి నన్ను."

నేనిటువంటివి ఇదివరకు విన్నాను. ముఖ్యంగా సముద్రపు దొంగల్లో ఎవడన్నా ఎదురుతిరిగితే వాణ్ణి నిర్జనద్వీపాల్లో వదిలివేస్తారు. వాడు కొంతకాలం పాటైనా చావకుండా కొంతఆహారం, తుపాకి, మందు కూడా ఇస్తారు. ఇది వాళ్లఆచారం.

"మూడేళ్ల కిందనండి, నన్నిక్కడ వదిలేశారు. అప్పట్నుంచీ సార్, గొర్రెలు, నత్తలు, రొయ్యలు, ఆకులలములు తింటున్నానంటే నమ్మండి. మనుషులు తినేఅన్నం కోసం మొహం వాచిపోయానండి. మీదగ్గిరేమన్నా జున్నుగడ్డగాని, కేక్ గాని వుందాండి. మీకాళ్లు పట్టుకుంటానండిసార్, కాస్త పెట్టండి."

"దగ్గిరేమీ లేదుగాని మాఓడమీదికి మళ్ళీ ఎప్పటికైనా వెళ్లడమంటూవస్తే నీకు తప్పకుండా బోలెడు పెడతాను," అన్నాను నేను.

"ఏమండి సార్! ఎందుకు వెళ్లలేరండి?" అని అడిగాడు.

"దానికిఅంతా కథ వుందిలే."

"మీపేరేమిటండి?"

"జిమ్ హాకిన్స్."

"హాకిన్స్‌గారూ! మీరు నమ్ముతారో నమ్మరోగాని, యీ మూడేళ్లు నే నెన్నికష్టాలు పడ్డానో చెప్పలేనండి. మృగాల్లాగా బతికానండి. నాకొక మంచిఅమ్మ వుందంటే నమ్ముతారా అండిమీరు?"

''ఎందుకు నమ్మను?'' అన్నాను మాఅమ్మను తలుచుకుంటూ.

''మాఅమ్మ చాలా మంచిదండి. ఎప్పుడూ దేవుణ్ణి పార్థిస్తూ వుంటుందండి. ఆవిడమాటలు వినకుండా నేను సముద్రపు దొంగల్లో చేరానండి. ఇప్పుడు బుద్ధివచ్చిందండి. ఇంకెప్పుడూ పాడుపనులు చెయ్యనండి. మంచిగా ఉంటానండి,'' అని ఆగి అన్నివేపులా సందేహిస్తూ చూశాడు. తరవాత మెల్లిగా చెవిలో చెప్పాడు. ''నాదగ్గిర చాలా డబ్బుఉందండి.''

మూడేళ్లు ఏకాంతప్రవాసం అనుభవించి నందువల్ల ఈమనిషికి మతిపోయిందనుకున్నాను. అలా అనుకుంటున్నట్లు అతడు గ్రహించాడల్లే వుంది. కొంచెం గట్టిగా, కోపంగా ఆమాటలే మళ్లీఅన్నాడు.

''నాదగ్గిర బోలెడు డబ్బుంది, ఏమనుకుంటున్నారో? నేను మొదట్లో మిమ్మల్ని చూశాను. కావలిస్తే ఆడబ్బంతా మీకే యిచ్చేస్తాను.''

అంతలో అతని ముఖంమీద సందేహరేఖలు

తోచాయి. నావంక తీవంగా చూశాడు. నా చెయ్యి గట్టిగా పట్టుకున్నాడు. సముద్రతీరంకేసి చూపిస్తూ,

"ఆ ఓడ ఎవరిది? ఫ్లింట్ దేనా?" అని అడిగాడు.

ఆ, ఫరవాలే దనుకున్నాను. ఇతడు ఫ్లింట్ శత్రువై ఉంటాడనీ, అందువల్ల నాకు మిత్రుడనీ అనుకున్నాను.

"కాదు. కెప్టెన్ ఫ్లింట్ చచ్చిపోయాడు. కాని అతని మనుషులు చాలమంది ఓడలో మాతో వచ్చారు. వాళ్లు మా మీద కుట్రపన్నారు," అని చెప్పాను.

"వాళ్లలో కుంటివా డున్నాడా?"

"సిల్వ రేనా?" అన్నాను.

"అవును, లాంగ్ జాన్ సిల్వర్!"

"ఉన్నాడు. వాణ్ణి వంటవాడుగా పెట్టుకున్నాము. వాడెదురుతిరిగి మిగతావాళ్లతో కలిసి మమ్మల్ని చంపటానికి చూస్తున్నాడు."

"ఈద్వీపం ఏమిటనుకుంటున్నారు మీరు?" అని అడిగాడు.

నేను మేము ఎల్లావచ్చిందీ, ఎందుకు వచ్చిందీ అంతా చెప్పాను. శ్రద్ధగా, కుతూహాలంతో విన్నాడు. విన్నాక నాతల నిమురుతూ ఇలాగన్నాడు.

"హాకిన్స్‌గారూ! మీరు బెన్‌గన్‌ని నమ్మండి. బెన్‌గన్ మీకే సహాయం కావాలన్నా చేసిపెడతాడు. ఈద్వీపంలో నాకు తెలియనిచోటు లేదు. అయితే మీ జమీందారుగారు నన్ను నమ్ముతారా మరి?"

"ఆయన చాలా మంచివాడు," అని చెప్పాను.

బెన్‌గన్ కొంచెంసేపు ఆలోచించాడు.

"నీతో ఒకరహస్యం చెబుతాను. మీరు ఏ పనిమీదవచ్చారో ఆపనినే నిదివరకే పూర్తిచేశాను: ఆ, అంతా, కాస్తకూడా మిగల్చకుండా చేసేశాను."

"నిజంగా" అని ఆశ్చర్యపోతూ అడిగాను.



"ఎక్కడుంటేనేం ? ఎక్కడో ఆ మూలగా దాచాను......"

"నిజంగా. నేను చచ్చినంత ఒట్టు"

"ఎక్కడుంది అదంతా?"

"ఎక్కడుంటే నేం? ఎక్కడో అమూలగా దాచాను. హాకిన్స్ గారూ! మీరు నాకు మాటివ్వాలి. జమీందారుగారికి నా సంగతంతా చెప్పి ఒప్పించాలి. నాకే మక్కర్లేదు. వెయ్యి పౌన్లయిస్తేచాలు. ఒప్పుకుంటారా?"

"తప్పకుండా ఒప్పుకుంటారు. అసలు అందరం కలిసి పంచుకోవాలనే మాప్లాను.

"మరి ఇంకోటుంది. నన్ను మీఓడలో మళ్ళీ ఇంగ్లండు తీసుకు వెడతారా?"

"తప్పకుండా. అసలు మాకు వెళ్లేటప్పుడు కళాసీలు ఎలాగూ తక్కువౌతారు గనక నువ్వువుంటే మాకు చాలా తోడుగావుంటుంది."

బెన్ గన్ ముఖం సంతోషంతో చేటంత అయింది. మనిషి స్థిమిత పడ్డాడు.

"ఇహ చెబుతాను వినండి. నేను కెప్టెన్ ఫ్లింట్ ఓడలో కళాసీని. అతను తను దోచిన డబ్బంతా ఈద్వీపంలో పాతిపెట్టాడు. అప్పుడు నేను, సిల్వర్, బిల్లీబోన్సూ ఓడలోవున్నాం. ఆఓడపేరు మీరు విన్నారుగా, వాల్రస్ అంటారు. ఫ్లింట్ ఇంకో ఆరుగుర్ని వెంటపెట్టుకుని వెళ్లి డబ్బుపెట్టెలు ఎక్కడో పాతిపెట్టాడు. పాతిపెట్టి, వచ్చేటప్పుడు. ఒక్కడే వచ్చాడు. మిగతా ఆరుగురూ ఏమయ్యారని మేమడగలేదు. వాళ్లని చంపేసి వుంటాడని మాకు తెలుసు. ఆ, అతడొక్కడే ఆరుగుర్నీ చంపేసి వుంటాడు. అతనిస్వభావం మాకు తెలుసు. కాని "డబ్బెక్కడ పాతిపెట్టావని" అడిగాం. "కావలిస్తే మీరుపోయి వెతుక్కోండి. నేను మాత్రం మీకోసం ఆగను," అన్నాడు ఫ్లింట్. మేం నోరు మూసుకున్నాం.

మూడేళ్లకిందట నేను ఇంకోఓడలో పనిచేస్తున్నాను. ఆఓడలో స్నేహితుల్ని ఒప్పించి ఈద్వీపానికి తీసుకొచ్చాను. వాళ్లు, నేనూకలిసి పన్నెండు రోజులపాటు లంకంతా వెతికాం. డబ్బెక్కడుందో కనిపించలేదు. వాళ్లు నేను మోసగించా ననుకున్నారు. నాకు ఒకతుపాకి, ఒకపార, గునపంయిచ్చి "బెన్‌జమిన్ గన్! నువ్వు నీయిష్టం వచ్చినంతకాలం యిక్కడే హాయిగా వుండు. డబ్బుదొరికితే నువ్వేతీసుకో" అనిచెప్పి వదిలేశారు. హాకిన్స్‌గారూ! అప్పట్నించీ యిక్కడే మృగాల్లో మృగంలాగా వుంటున్నాను. మిమ్మల్ని చూడగానే నాకు ప్రాణంలేచి వచ్చింది," అని కళ్లనీళ్లు పెట్టుకున్నాడు.

"బాబూ! మీ జమీందారుగారితో చెప్పండి. 'బెన్ గన్ చాలా మంచివాడు. మూడేళ్లు ఎండలో, వానలో, చలిలో, వెలుగులో, చీకటిలో బతికాడు.

[47-వ పేజీ చూడండి]

# శ్రీకాంతుని చెముడు

నపురపు జమీందారు శ్రీకాంతుని పేరు తెలియని వారు లేరు. ఆయన వసంతమహల్‌ను చూచిన వాడు తాజ్‌మహల్‌ను వెంటనే తలచు కొంటాడు. ఆయనకంతా ఉన్నది. సిరి, సంపత్తు, మంచిపిల్లలు, అందమైన భార్య, ఇంకేం కావాలి. కాని ఆయనకుండే కొరత ఒక్కటే. అదేమిటంటే ఆయనకు బ్రహ్మ చెముడు. మొత్తుకున్నా వినపడదు. ఎవరైనా స్నేహితులు వచ్చి "బాగున్నారా" అంటే "పిల్లలా... అక్కడెక్కడో ఆడుకుంటూ ఉంటారు" అంటాడు. భార్యవచ్చి "భోజనానికి రండి" అంటే "డాక్టరు గారు సాయంత్రం వస్తానన్నారు" అని జవాబు చెప్తారు.

చిన్నపిల్ల వసంత దేనికైనా నవ్వితే ఆమె చెప్పిందేదో తనకు వినపడలేదని అందుకు నవ్వుతూందని అనుకొని ఒకసారి ఆమె ఒళ్ళుహూనం చేశారు. ఈ చెముడుతో మహాకష్టమై పోయింది. కాని ఒకనాటిదా, రెన్నాళ్ళదా! కలకాలముండే దానికి ఏమిటేడ్చేది. ఆయనకు ఇదే దిగులు పట్టుకున్నది. భార్యతో ఏమన్నా సరసాలాడితే ఆమె చెప్పేదేదో తనకు వినపడదాయె? ఇక ప్రక్కింటి వాళ్ళవరకు పోయేట్లుగ ఎవరుసరసాలాడుతారు? పిల్లలను దగ్గరికిపిలిస్తే వాళ్ళు చెప్పేదేదో తనకు వినిపించదు. గట్టిగా అరుస్తూఉంటే పిల్లలు ముద్దొస్తారా? ఆయనకు ఇల్లొకనరకం అయిపోయింది. ఈ చెముడుకు తోడు పిసినారితనం ఒకటి ఏర్పడింది. అందరిండ్లల్లో కిలకిలలు, పకపకలూ అయితే శ్రీకాంత్ గారింట్లో మూలుగులూ పెడబొబ్బలూ.

ఒకరోజు శ్రీకాంత్ గారు పేపరు చదువుతూ ఉన్నారు. అక్కడ ఆయన దృష్టికేదో తగిలింది. వెంటనే దాన్ని ఆమూలాగ్రంగా చదివారు. వెంటనే ఒకగంతువేసి తన గదిలోకి పరిగెత్తారు. పాపం! అరగంట సేపటినుండి కాఫీకప్పుతో ఎదుట నిల్చునిఉండే అర్థాంగిని చూడనేలేదు. ఈ యన ఆర్భాటానికి బెదురుకొని ఆమె చేతిలోని



కాఫీకప్పు పమాంతంగా క్రింద అడింది.

సాయంత్రానికి జమీందారు గారి ప్రయాణ సన్నాహాలతో ఇల్లంతా అదిరి పోతున్నది. "నా పెట్టేదీ" అంటూ లోపలికొచ్చారు జమీందారు. "ఇందాకనే కారులో పంపించాను." అందా యిల్లాలు. "మీ పెట్టెగొడవ నాకేం తెలుసూ" అన్నట్లు ఆయనకు వినబడింది. కాని ప్రయాణం మూలాన్ని ఆమె నేమన డానికి ఆయనకు మనసొప్పలేదు.

జమీందారుగారు అవసరమైన పనిమీద ఒక ఊరు వెళ్ళారు. ఎప్పుడూ తనతో ఒక నలుగురు సేవకులనైనా తీసుక వెళ్ళేవారు. కాని ఈసారి మాత్రం ఒంటరిగానే వెళ్ళటం, అందరికీ ఆశ్చర్యాన్ని కలిగించింది. అసలుగురి సేవకులకూ చాల సంతోషమైంది. ఈ నెల రోజులలోను జమీందారు కుటుంబం పొందిన ఆనందానికి మితిలేదు. పెద్దబ్బాయి గోపాల్ "చెవిటినాన్న పీడ వదిలిందిరా" అనుకున్నాడు. ఇంక భార్య సమాచారం చెప్పే దానికే వల్లగాదు. కొన్ని రోజులయినా హాయిగా ఉండవచ్చుగదా అనుకున్నది. పనివాండ్ర కందఱికి రెండురోజులు లీవు దొరకింది.

ఈ సమయంలో ఉన్నట్లుండి జమీందారుగారు దిగారు. ఎవ్వరికీ వ్రాయలేదు. ఆఖరికి భార్యకేనా ఒక ఉత్తరం ముక్క వ్రాయలేదు. బానుగ జట్కాలో వస్తూన్నాడు. దోవలో తనగుమాస్తా కృష్ణమూర్తి అవుపించేటప్పటికి తానే బండిదిగి "ఏం, కృష్ణమూర్తీ" అన్నాడు. కృష్ణమూర్తి అతివినయంతో నమస్కారం చేసి బిగ్గరగా "బాగున్నారా! ఇప్పుడేనా రావటం, మాకు కబురైనా పంపించలేదే" అన్నాడు. జమీందారు ఫక్కున నవ్వాడు. ఎందుకు? కృష్ణమూర్తి బిగ్గరగా మాట్లాడినందుకు. ఇప్పుడిక బిగ్గరగా మాట్లాడవలసిన అవసరం లేదని అతనికెలా తెలుసు? అసలు శ్రీకాంత్ ఇన్నిరోజులు ఒక హిమాలయయోగి దగ్గర మందు పుచ్చు

కొని తన చెముడు నిశ్శేషంగా పోగొట్టుకున్నాడని, అందుకే ఆయన ఊరికని వంకపెట్టి పోయిన్నాడని చెప్పకపోతే ఎవరికేం తెలుస్తుంది?

"ఆ! ఆ! బాగున్నా, ఏదో ఎందుకులేఅని చెప్పి పంపించలేదు. పనులన్నీ సరిగా జరుగుతూన్నాయనుకుంటాను. సరే వెళ్ళిరా" అని వెనక్కు తిరిగాడు. అతను ఉత్సాహంతో ఉప్పొంగి పోతున్నాడు. ఇంతలో "పిసిని ముండాకొడుకు మూత్రపాణాలు తీయడానికి మళ్ళీ దాపురించాడు" అనే కృష్ణమూర్తి మాటలు వినిపించినాయ్. కృష్ణమూర్తిని వెనక్కు పిలిచి "ఏమిటి వాగుతూన్నావ్!" అని గర్జించాడు. "అబ్బే! నేనే మనలేదండీ, మీకేమి వినిపించిందీ!" అన్నాడు అతి నమ్రతతో. ఏమనలేక బండెక్కాడు శ్రీకాంత్. కాని కృష్ణమూర్తినోరు వాగుతూనే ఉన్నది. "అబ్బే! ఘరవాలేదే చెమిటి కుంకకుగూడా వినబడుతూన్నది. ఏమిటి వాగుతున్నావ్‌ట. వాగనూ, వాగుతా, లక్షసార్లు వాగుతాను. వెధవకి..." ఇంకాఏమిటి, శ్రీకాంత్‌కు ఒళ్ళు మండిపోయింది. కాని ఒకప్రక్క కొంచెం ఓదార్పుగా ఉన్నది. ఇంక మీద ఏకుంకలు ఏమి వాగినా కూడా తనకు తెలిసిపోతుంది. ఇన్ని రోజులులాగా నాటక మాడడానికి



వీలులేదు. ఇంతలోనే ఇల్లుజ్ఞాపకం వచ్చి ఈ బాధ అంతా మరచిపోయాడు. తనకు చెవుడు పోయినదని తెలిస్తే భార్య, పిల్లల ఆనందానికి అంతు ఉంటుందా? ఇంక తనభార్య మెల్లగా చెప్పే ముద్దు పలుకులన్నీ తాను వినవచ్చు. పిల్లల జిలిబిలి మాటలు వింటూ హాయిగా ఉండవచ్చు. ఈ ఆలోచనలతో బండి తమయింటి దగ్గర ఆగింది కూడా తెలియలేదు. ఆనందంతో కలలుగంటూ గేటుదాటి లోపలికి పోయినాడు. వరండాలో కొడుకు వేణు, కూతురు వసంత ఉండినారు. వాళ్ళు సంతోషంగా స్వాగత మిస్తారనుకున్న శ్రీకాంత్‌కు ఆశాభంగమైంది. కాని వసంతను చూచేసరికి అంతా మరచిపోయి "ఏం! వసంత్! బాగున్నావా! ఏరోయ్ వేణూ" అంటూ పల్కరించారు. వాళ్ళు మాట్లాడ్డం నిష్ఫలం అనుకున్నట్లు ఒక చిరునవ్వు నవ్వారు. ఆయన గడపదాటాడో లేదో "బాగుకేం! చాలా బాగున్నా. ఒక జార్జెట్ చీర కొనిపెట్టమంటే కొనిచ్చాడూ, ఛీ" అందివసంత. "నేను టెన్నిస్ రాకెట్టు తీసుకోవాలనుకుంటూండినాను. ఇంతలో దిగబడ్డాడు ముసలి ముండాకొడుకు" అన్నాడు వేణు. జమీందారుకు అడుగుపడలేదు. తనకడుపున పుట్టిన బిడ్డలే తనన సహ్యించుకుంటూన్నారంటే అతనిమనసు నిలువునా మండిపోయింది. నేరుగా మేడమీదికి వెళ్ళాడు.

"ఏరోయ్ వెంకా! అయ్యగారొచ్చారు. మళ్లీ మనల్ని ఏపుకుందికి. నల్లో ళ్ళు లచ్చనంగా.

ఉంటిమి గదా!" అంటూన్నాడు సుబ్బడు. శ్రీకాంతుని ఒళ్ళంతా జెల్లులు పాకినట్టయ్యింది. ఆనందమంతా నిముషంలో మటుమాయమయ్యింది. ఆకలి దాహం కూడా జ్ఞాపకం రాలేదు. గుమస్తా కృష్ణమూర్తి దగ్గర్నుంచి, నౌకరుసుబ్బడి వరకు...అందరికీ తానంటే ఎంత కంటగింపు. చటుక్కున ఒక మెరుపు మెరిసింది. తనభార్య జ్ఞాపకంవచ్చింది. వెంటనే మనస్సులోభారమంతా క్రమంగా దిగిపోసాగింది. ఆమెగదా తనఅర్ధాంగి. ఈస్థితిలో తననుచూచి ఎంత సంతోషిస్తుందో. అయినా వాళ్లు పిల్లలు. వాళ్లకు కావలసినవన్నీ ఇకమీద తీసిస్తే వాళ్లు ఎంతో సంతోషంగా ఉంటారు. ఇంకతనకు ఇల్లే స్వర్గం.

"కమలా, కమలా!" అని భార్యను పిలిచాడు. భార్యవస్తే ఎట్లా మాట్లాడాలి? మొదటంతా చెప్పకూడదు. ఏమన్నా గట్టిగా మాట్లాడితే అప్పుడు పరిహాసంచేసి చెప్పాలి. ఇంతలో మెట్లఅడుగుల చప్పుడు. చప్పుడుతోబాటు భార్య మాటలు. "మళ్ళీ వచ్చింది పీడ. ఒక్కనెల రోజులు హాయిగా ఉన్నాము. మళ్ళా మొదలు అబ్బబ్బ, ఏమి వేపుక తింటూన్నారో, సర్వేశ్వరా..."

గది తలుపు తెరుచుకుంది. కమల ప్రవేశించింది. జమీందారుగారి అప్పటి మనస్థితిని వర్ణించేదానికి ఎవరివల్ల అవుతుంది? ఆగదినాలుగు గోడలూ సమాధిలాగ తనమీద పడుతూన్నట్టు ఊహించుకున్నాడు.

విసుగుతో ముఖాన్ని చిటపటలాడిస్తూ "ఏం" అంది కమల. శ్రీకాంత్ కు బాధతో నోటమాట రాలేదు. "ఏం లేదు! పో" అన్నాడు. కమల ఒక గంతువేసి క్రిందకి వెళ్ళిపోయింది. నిద్రరాకపోయినా మండిపోయే కళ్ళను మూయటానికి ప్రయత్నించాడు శ్రీకాంత్.

మరునాడు ప్రొద్దున్నే మరల హిమాలయ యోగి దగ్గరకు ప్రయాణమైనాడు ఎందుకు తెలుసా? చెవుడు పోగొట్టుకునేందుకు కాదు. మరల చెవుడు రప్పిస్తాడేమో అడిగేదానికి! ★

# మానశ్యంబంగారంకాను

శ్రీ యం. వి. సుబ్బారావు

వెంకటేశం మాస్టరుగారు కొంచెం పూర్వకాలపు మనిషి. అసలే నియోగి కుటుంబంలోవాడు; అందులో తాతలనాటినుండి కొంత దర్జాగా కాలక్షేపం జరిగిన కుటుంబం. అయితేనేమి, వీరి తండ్రిగారు పూర్వంనుండి వస్తున్న భవనంలోనే వుంటూ, మ్యునిసిపల్ ఆఫీసులో నెలకు రూ. 80 వేతనంలో ఉద్యోగంచేస్తూ మంచి పలుకుబడి సంపాదించి, తాత తండ్రులనాటి పెద్దపేరుకు లోటు రాకుండా కాలక్షేపం చేయడానికి యత్నం చేస్తూండడంవల్ల, భూములమీద కొంత అప్పుచేసి, ఒకటో రెండో భూములు విక్రయం చేసి, కాలధర్మం చెందారు.

అప్పులపుప్పి భూములు, బేమరమ్మత్తుగానుండి, ఊరుస్తూ గోడలు అక్కడక్కడ బీటలిచ్చిన అతారా కొంప, విశాలమైన పెరడు మాత్రం మిగిలాయి. వెంకటేశం మాస్టరుగారి ఆస్తిఅంతా ఇదే. అయితే మాత్రం గౌరవ మర్యాదలకు తక్కువా? దర్జాకి తక్కువా?

స్కూలు మాస్టరు పనిలో వుంటూ, పూర్వకాలపు ముస్తాబుతో—అనగా గిరజాలు, చేతికి కొనకాడ, ముత్యాల తమ్మెట్లు, నుదుట చందనం, అక్షతలు, చాలా పండిపోయిన పెద్దమీసాలు, లాంకోటు, ఉత్తరీయం, గొడుగు, చడావు జోళ్లు—వెంకటేశం మాస్టరుగారు వీధిలో నడచి వెళ్తూంటే తమాషాగా ఉండేది. తగు మనుష్యులందరు సగౌరవంగా పలుకరించి నమస్కారాలు చేసేవారు. బడిపిల్లలు మాత్రం ఇళ్లల్లోకి దూరిపోయేవారు. “అరుగో చేదస్తపు మాస్టరుగారు స్కూలుకు వెళ్తున్నారు” అని కొందరు వింతగా చూస్తూండేవారు. “వెంకటేశం మాస్టరుగారే కదూ; లేచీ దేనిటి కూర్చొవమ్మా,” అని కొందరు స్త్రీలు వీధరుగులమీద నిర్లక్ష్యంగా కూర్చొనేవారు.

వెంకటేశంగారు మొదట లోవర్ సెకండరీ స్కూలుకు హెడ్ మాస్టరుగా ఉండేవారు. హోదా బాగుండేది. సహోపాధ్యాయులు — ముఖ్యంగా డ్రాయింగు మాస్టరుగారు, కసరత్తు మాస్టరుగారు, రైటరుగారు, ఇద్దరు బంట్రోతులు — తరచుగా వెంకటేశంమాస్టరుగారింటికివస్తూపోతూ, వారివెనుక నడుస్తూంటే కొంత హోదాగానే ఉండేది.

చాలాకాలం ఇలాగు సాగగా, మునిసిపల్ సభవారు ఈ స్కూలును హైస్కూలుగా చేయాలని తీర్మానించారు. అందాకా సాల్గవ ఫారం స్థాపించి, ఒక బి. ఎ., ఎల్. టి. ని హెడ్ మాస్టరుగా వేశారు. అప్పటినుండి, అప్పారాయకవి చెప్పినట్లు, కథ అడ్డంగా తిరిగింది. ఉపాధ్యాయులు, రైటరు, బంట్రోతులు క్రొత్త హెడ్ మాస్టరుగారి వెనుక తిరుగవలసి వచ్చింది. అయినా వారెవ్వరికీ కూడా వెంకటేశం మాస్టరి గారిమీద గౌరవం అభిమానం తగ్గలేదు. కొత్త హెడ్ మాస్టరు చాలా పిన్నవయస్కులయినా గౌరవమయిన కుటుంబంలో వారవుటవల్ల మన వెంకటేశం మాస్టరుగారిని ఎంతో గౌరవంగా చూస్తూ, వారి వయస్సుకు, పూర్వపు హోదాకు తగినట్లు మర్యాద చూపిస్తుండేవారు.

ఏది ఎంత బాగున్నా హోదా తగ్గిపోయింది. ఇది వెంకటేశంగారికి చింతకు కారణమయింది. అయితే మాత్రం, మంచి సాంప్రదాయం గల పెద్ద నియోగికుటుంబంలో పుట్టిన మనిషి బేలాకికంగా బయట పడతాడా? ఎలాగయినా మనస్సులో

ఉత్సాహం తగ్గింది; దానికి తోడు పెద్దకుటుంబం, ఖర్చులు తగ్గవు. అప్పులు తంతున్నాయి. భూములు అమ్మకూడదు! ఇల్లు అమ్మకూడదు — గ్రాసం ఒకరి దయినా వాసం మనదే ఉండాలని పెద్దలు అనలేదూ!

ఇది ఇలాగ ఉండగా, మరుచటి సంవత్సరం ఇనస్పెక్టరుగారు స్కూలు తణిఖీచేసి, అయిదవ ఫారంకూడా పెట్టవచ్చుననిన్నీ మూడవ ఫారానికికూడా బి. ఎ., ఎల్. టి. ని ఉపాధ్యాయునిగా వెయ్యాలనిన్నీ రిపోర్టు వ్రాశారు. వెంకటేశంమాస్టరుగారిని రెండవఫారం మాస్టరుగా దించేశారు. దీనివల్ల వెంకటేశం మాస్టరుగారికి మరింత మనోవ్యథ కలిగింది. జీతం తగ్గకున్నా హోదా తగ్గుతే నామోషి కాదటండీ, మరీ!

వెంకటేశంగారి తాతగారు ఘనవైద్యులట. అనేక భస్మాలు, స్వయంగా చేసేవారట. బీదలకు ఉచితంగా చికిత్సచేస్తూండే వారట. కొన్ని భస్మాలు, వైద్యగ్రంథాల తాటాకు ప్రతులు మొదలయినవన్నీ వెంకటేశంగారు భోషాణం పెట్టెలో భద్రపరచి, భూములకన్నా, ఇంటికన్నా హెచ్చుగా కాపాడుతూఉండే వారు. బంగారంచేసే యోగం వీరి తాతగారికి తెలిసి ఉండేదని వీరూ వారూ అనుకోడం వెంకటేశం గారికి జ్ఞాపకం. వెంకటేశంగారు గ్రంథాలన్నీ తిరగేస్తూ, ప్రతిశ్లోకం కూడా సువర్ణయోగానికే అన్వయిస్తూండేమో నన్న భ్రాంతితో పరిశీలిస్తూండేవారు. డబ్బులోటు అధికమైనకొలది సువర్ణయోగ పరిశోధనకూడా అధికం అయింది. మూలికలతోను పసర్లతోను ఈ యోగం సాధింపవచ్చునని వెంకటేశంగారి నమ్మకం.

కసరత్తు మాస్టరు అప్పలస్వామిగారు పింఛన్ తీసుకొన్న హవల్దారుగారి కుమారుడు. హవల్దార్ అప్పన్నగారు చాలా భక్తిపరులు. ప్రతి శనివారం భజన, ఏకాదశి ఉపవాసాలు, బైరాగులతోను, సాధువులతోను సహవాసం, చీమల పుట్టలలో బియ్యం, నూకలు వేస్తూండడం— ఇవి హవల్దార్ గారికి సాధారణకాలక్షేపాలు. కసరత్తు మాస్టరు అప్పలస్వామి గారికికూడా పూజాపునస్కారాలు, భజన, సాధుసాంగత్యం అలవాటు. ఆంజనేయోపాసన, భేతాళ పూజ, దసరా పండుగలలో తాలింఖానాలలో ఆయుధపూజ, సాము, గరిడీలు, వగయిరాలు జరిగించేవారు; బ్రాహ్మణభక్తి మెండుగా ఉండేది. అంతేకాదు చతుర్థవర్ణంలో జన్మించినా సంభాషణలో మాత్రం సంస్కారంగల బ్రాహ్మణోత్తముల వలె ఉచ్చారణ చేయడానికి చాలా యత్నం చేసేవారు. సన్యాసులతో సహవాసంచేస్తూ, వారిని ఆదరిస్తూ పండూ ఫలం ఇస్తూ, వారి సేవచేస్తూ చిన్నచిన్న మందులు, బైరాగి చిట్కాలు నేర్చుకున్నారు. ఇరుకు, దిష్టి, తేలు మొదలయిన మంత్రాలు వేస్తూండేవారు. అరచేతిలో తామ్రభస్మం చేయడానికి కావలసిన మూలికల గురించి తరచు ప్రసంగిస్తూండేవారు. పాదరసం బంధించి గుటికచేస్తే అదే పరుసవేది అనిన్నీ, దానితో ఇత్తడి, రాగి, బంగారంగా మార్చవచ్చుననిన్నీ అంటూండేవారు. కప్ప, తొండ, చెముడుకాకి మొదలయిన వాటితో 64 పుటాలువేస్తే పాదరసం బంధించవచ్చుననిన్నీ ఎంతో గట్టిగా వాదించేవారు. వేమన పద్యాలన్నీ సువర్ణయోగంవిషయమే అని తమకు సదుపాయమైన వ్యాఖ్యానం చేస్తూండేవారు.

ఇంక వెంకటేశంమాస్టరుగారి సంగతి ఎలాగుందంటే: సువర్ణయోగం వెర్రిలోపడి సంసారం విషయాలలో కేవలం అశ్రద్ధ చేసేశారు. రెండు ప్రయివేటు ట్యూషన్లు చెప్పకొన్నా నెలకు పాతికో ముప్ఫయ్యో దొరకేవి. కూరఖర్చుకయినా కలిసివచ్చియుండేది. ఈ వెర్రిలో మునిగిపోతున్న కొద్దీ అప్పులు మరింత పెరిగిపోయాయి. దావాలు, డిక్రీలు హెచ్చయినకొద్దీ సువర్ణయోగ దీక్ష అధికం అయింది. క్లాసులో పాఠాలు లేవు; ఇదే ప్రసంగం; పిల్లలు కొంటెతనంచేసి, పాఠాలు కాకుండా చేయడానికి ఏదో మిష పెట్టి సువర్ణయోగం గురించి మాటల్లోకి దించేవారు. సిగరెట్టు పెట్టెలో తగరంరేకు నలిపి, ఉండచేసి "మాస్టారూ, ఇదిగో వెండి చేశాను, చూడండి," అనే వాడొకడు; ఇంకొక వెంకి పిల్లకాయ ఏడుస్తూవచ్చి, "మాస్టారూ, మాస్టారూ, చూడండి — కామిగాడు నా ఇత్తడిబొత్తాయి అల్లా తుప్పల్లోకి విసిరేసేడు; వెతగ్గా

వెత్తగ్గా దొరికింది గాని, ఏవన మూలికకో తగిలి బంగారంగా మారిపోయిందండి. ఈ సంగతి తెలుస్తే మా నాన్నగారు నన్ను గంతా రండి," అని గోల చేస్తూ ఫిర్యాదు చేసేవాడు. ఇలాగే వెళ్తూండేది వెంకటేశం మాస్టరు గారి క్లాసు.

ఇక డ్రిల్లుక్లాసులో ముచ్చట: "మాస్టారూ, ఆ చెట్టుమీద తొండ ప్రాకుతూంది, పట్టుకొంటా" నని పారిపోయేవాడు ఒకడు; మరొకడు -"మాస్టారూ, చెముడు కాకిని పట్టుకో వాలంటారు గదా, కాకికి చెముడు ఉందో లేదో ఎలాగు తెలుస్తుంది?" అంటాడు. "ఓరి వెర్రి వెంగళయ్యా! ఈ మాత్రం జ్ఞానం లేదూ. కాకిని పట్టుకొని, కాకీ, కాకీ అని పిలవాలి. పలికిందంటే చెముడు లేదన్నమాట. పలకకపోతే అదే చెముడుకాకి," అని ఎంతో ప్రజ్ఞగా బోధించి, "కాదూ మాస్టారూ?" అంటాడు ఒకడు. తొండకోసం ఒకడు పారిపోతే, మరొకడు "బెకబెకా, బెకబెకా" అని ఇంకొకడు "బొంగ్రు, బొంగ్రు" అని కప్పలాగ ఆసనంవేసి గెంతుతాడు.-ఇదే డ్రిల్లు క్లాసు!

వెంకటేశం మాస్టరుగారికీ, అప్పలస్వామి మాస్టరు గారికి ఎప్పుడూ వాగ్వాదమే. మూలికలు, పసర్లు లేకుండా సువర్ణయోగం సాధ్యంకాదని వెంకటేశం గారూ; కప్ప, తొండ, చెముడుకాకి లేకుండా ఎన్ని జన్మాలకయినా సువర్ణయోగం కానేరదని అప్పలస్వామిగారూ. మధ్యాహ్నం లీషర్ పీరియడ్‌లో రోజూ ఇదే కామన్ రూములో కాలక్షేపం.

ఒకనాడు ఇంటర్వెల్లో కామన్ రూములోకి తెలుగుపండితులు గణపతిశాస్త్రిగారు ప్రవేశించారు. మహా పెంకిఘటం; నారదుణ్ణి, విశ్వామిత్రుణ్ణి కలిపి ఒక్క మూర్తిగా చేస్తే ఎలా గుంటుందో గణపతి శాస్త్రిగారి సంగతి అలా గుంటుంది. ఒక దేవకాంచన పుష్పం పట్టుకొని, దాని మహిమను వర్ణిస్తూ ఏవో దొంగశ్లోకాలు చదివి, ఈ పుష్పంతోనే దేవతలు బంగారం చేస్తూండేవారని ఉపన్యాసం ప్రారంభించారు. క్రమంగా సువర్ణయోగం వాగ్వాదంలోకి దిగింది.

"ఇదుగో చూడండి, నా మూలికల మహిమ," అని వెంకటేశం మాస్టరుగారు జేబులోనుండి కొన్ని లోహపుబిళ్లలు, ముక్కలుతీసి టేబిల్ మీద పెట్టి ఇలాగ అన్నారు. "జాగ్రత్తగా పరీక్షించి చూడండి; సువర్ణ రేఖలు ఎంత స్పష్టంగా కనిపిస్తున్నాయో"

కసరత్తు మాస్టరు అప్పలస్వామి గారు వెంటనే లేచి అన్నారు: "అయ్యా, వెంకటేశం బాబుగారూ, తమరు పెద్దలు' బ్రాహ్మణోత్తములు. క్షమిస్తేమనవి చేస్తాను. తమకు పిచ్చిభ్రమ పట్టుకున్నది. మీ లోహపు ముక్కల్లో ఎంత వెదికినా సువర్ణరేఖలు సూచనలే లేవు. ఇదిగో చిత్తగించండి; చెముడుకాకితో పుటం వేసిన తామ్రం; పదోవన్నె బంగారం వర్ణం ఎలాగు తళుక్కు, తళుక్కు, జిగజిగా, జిగజిగా, అపరంజివలె విద్యుత్కాంతివలె, తరుణభాస్కరునివలె ప్రకాశిస్తూందో బహుశ్రద్ధతో పరీక్షించి చూస్తే గోచరిస్తుంది. నిదానించి చూడండి" అని గుప్పెడు లోహంముక్కలు టేబిల్ మీద పడేసేరు. మహా ధాటీగా మా అందరివైపు చూచేరు.

ఎవరిపక్షం తీర్మానించడమో ఎవ్వరికీ తోచలేదు. సంస్కృత పండితులు నరసింహశాస్త్రిగారు బాగా ఆలోచించి ఇలా గన్నారు. "సువర్ణం నాడెంచేయడం మనకు తెలియదు. ఇందుకు తగినవారు విశ్వకర్మలే-అనగా విశ్వబ్రాహ్మణులు."

"సరే; తమరు శలవిచ్చింది న్యాయంగా ఉంది. విశ్వకర్మ కులంలోవారే కాబట్టి మన

డ్రాయింగు మాస్టరు వీరాచారిగారే నాడెంచేసి వన్నెకడితే మనం అందరం అంగీకరించక తప్పదు," అన్నారు గణపతి శాస్త్రిగారు.

"బాబూ, బంగారం వన్నె కట్టడం, నాడెం చేయడం నాకు రాదు, నన్ను క్షమించండి. విశ్వకర్మ వృత్తిలో ప్రజ్ఞ ఉంటే డ్రాయింగు మాస్టరుపని ఎందుకు చేస్తాను, బాబూ," అన్నారు వీరాచారిగారు.

గణపతిశాస్త్రి: "పుట్టుకవల్ల విశ్వకర్మ లేగాని అనుభవించేది ప్రారబ్ధకర్మ కాదటయ్యా? ఎంతయినా, కులవిద్య పోతుందా? వీరిద్దరి సువర్ణం మీరే పరీక్షించి నాడెం చేయకతప్పదు. నరసింహా శాస్త్రిజీ, మీరుకూడా వీరాచారి గారికి సహాయంచేస్తే బాగుంటుంది. బుద్ధికుశలత బాగా వికసించేటందుకు కొంచెం నస్యం ఆఘ్రాణించండి."

నరసింహాశాస్త్రిగారు నస్యం డబ్బా తీయబోయారు; జేబులో లేదు. వెతక నారంభించేరు. "ఏదీ నా నస్యండబ్బా?" అని తడుముకుంటున్నారు.

గణపతిశాస్త్రిగారు: "మీ నస్యం బంగారంగానూ! అంత వెతుక్కుంటున్నా రేమిటండీ! అదుగో ఆ నోటుబుక్కు మధ్య కనిపిస్తూంది; తీసుకోండి."

నరసింహాశాస్త్రి: "నా పొడుం డబ్బా ఇక్కడకు ఎలా గొచ్చింది?" అని మూతవిప్పి ఆశ్చర్యంతో "గణపతి శాస్త్రిగారూ, మీ ఆశీర్వచనం ఫలించింది; ఏమి వాక్శుద్ధి!" అని బిగ్గరగా అరిచేరు.

"ఏమిటయింది బాబూ?" అన్నారు డ్రాయింగుమాస్టరు వీరాచారిగారు.

గణపతిశాస్త్రిగారు ఏమీ ఎరగనట్లు ఊరుకున్నారు.

"ఏమిటయిందా? నా నస్యం బంగారం అయిపోయింది గణపతిశాస్త్రీ! ఇది నీ దెబ్బే! నీవు నారదుడంతటివాడవు; విశ్వామిత్రుని మించిపోయేవు," అన్నారు నరసింహాశాస్త్రిగారు.

గణపతిశాస్త్రి: "ఏమిటయిందో చెప్పండి." నరసింహాశాస్త్రి: "మీ ఆశీర్వచనఫలమో, వెంకటేశం మాస్టరుగారో లేక అప్పలస్వామి మాస్టరుగారో సువర్ణ యోగం ప్రయోగించారో గాని నా నస్యం అంతా బంగారపు పొడిగా మారి పోయింది! ఇదుగో చూడండి."

వెంకటేశంమాస్టరుగారు తెల్లబోయేరు. అప్పలస్వామిమాస్టరుగారు నిర్ఘాంతపోయేరు.

డ్రాయింగు మాస్టరు వీరాచారిగారు తమ సంచి వెతుక్కొని: "అయ్యో, నా గోల్డు డస్టురంగు ప్యాకెట్ ఏదీ!!" అని కంగారు పడసాగారు. ★

## ★ వీనుల విందు ★

### శ్రీ కొప్పర్తి యజ్ఞన్న

అనగనగా ఒక ఊళ్లో ఒక జమీందారు ఉండే వాడు. ఆయన చాలాలోభి. ఒకరోజున ఒక ముష్టివాడు ఆయన సమీపానికి వచ్చి అద్భుతంగా ఒక పాట పాడాడు. ఆపాట జమీందారు విన్నాడు. విని, ప్రక్కనేవున్న తన గుమాస్తాతో "బిచ్చగానికి ఒక నూరు రూపాయలు ఇవ్వ" మని చెప్పాడు. 'చిత్తం' అంటూ ఆగుమాస్తా వెలుపలికి వెళ్లాడు.

పాపం ముష్టివాడు గుమాస్తాతో బాటుతిరిగాడు. తనడబ్బు తనకిమ్మన్నాడు. గుమాస్తా 'ఉ' అనలేదు 'అ' అనలేదు. చివరికి విసిగి జమీందారుతో ఫిర్యాదుచేశాడు. "అతని కంటె ఘనుడు ..." అన్నట్లు ఆ జమీందారు ఆ ముష్టివానిని చూచి "ఒరేయి! పిచ్చివాడా! నీవు నాకోసం ఏవిధంగా కష్టపడ్డావని సొమ్ము అడుగుతున్నావు? నీపాటవలన నాచెవులకు ఆనందం కల్గింది. దానికి బదులుగా నీ చెవులకుకూడా ఆనందం కల్గటానికని నే నలా చెప్పాను. బదులుకు బదులు సరిపోయింది. వెళ్లిరా బాబు!" అంటూ పలికేసరికి ముష్టివాడు తల వంచుకొని వెళ్లిపోయాడు. ★

# ★ సినిమాలు: ప్రజాభిప్రాయం ★

ఈ కాలపు పరిశ్రమ లన్నిటిలోకీ సినిమాలకు ప్రజలపైగల ప్రభావం మరి దేనికీ లేదు. పత్రికల ప్రభావమే ఎంతో గొప్పగా చెప్పుకోదగినది, కాని సినిమాతో పోలిస్తే పత్రికల ప్రభావం సహస్రాంశం ఉండదనిపిస్తుంది. అయితే ప్రజలపై సినిమాలకుండే ప్రభావం రకరకాలుగా ఉంటుంది. అన్ని రకాల ప్రభావాన్నీ ఆదరించటానికి లేదు, ఆమోదించటానికీ లేదు.

తరుచు చూసేవారికి సినిమాలోక నల్లమందులాటి దురలవాటుగా పరిణమించ గలవన్నది అందరికీ తెలిసినసంగతే. జీవితంలో లభించని, జీవితంతో సంబంధం లేని కృత్రిమానందమూ, ఉద్రేకాలూ, సౌందర్యవతుల సన్నిహిత సందర్శనమూ జీవితంలోని కొన్ని లోట్లను తీరుస్తాయనే భ్రమకు సినిమా ప్రేక్షకులు క్రమంగా లోనవుతారు. కొంతకాలం సినిమాలు చూడకుండా చేసినట్టయితే వీరు బాధపడతారు. వీరిలో కొందరికి సినిమావ్యామోహం వ్యసనమైపోయి సినిమాకు సంబంధించిన వార్తలను ఆసక్తితో పోగుచెయ్యటమూ, ఆలకించటమూ, చర్చించటమూ మొదలైన పనులు చేస్తారు. మరికొందరు సినిమాతారలకు, సినిమా పత్రికలకూ రాస్తారు. ఇంకా కొందరు సినిమా ప్రపంచంలోకి ఏవిధంగానైనా అడుగుపెట్టటానికీ, సినిమాగాలి ఊపిరితిత్తుల్లో పోసుకోవటానికీ వ్యర్థయత్నాలుచేసి తమ కాలాన్నీ, జీవితాలనూ, అవకాశాలనూ కూడా ధ్వంసం చేసుకుంటున్నారు.

ఇదంతా సినిమాల ప్రభావమే గాని వాంఛనీయమైన ప్రభావం కాదు. ఇంకొక రకమైన ప్రభావంకూడా కనిపిస్తున్నది. ఈ రకం ప్రభావం అనేక కళలకు ఉంటుంది. చాలామంది సినిమాప్రేక్షకులు తమ అభిమాన చిత్రాలలోని కథాంశాలనుంచి జీవిత ప్రమాణాలు ఏర్పరుచుకుంటూ, తమను బలంగా ఆకర్షించిన సంభాషణలను నిత్యజీవితంలో వాడేస్తున్నారు. ఇటువంటి ప్రభావాన్ని పూర్తిగా కొట్టివెయ్యటానికీ గాని ఆమోదించటానికిగాని లేదు. ఎందుచేతనంటే ఇది ప్రతికళకూ ఉండదగిన ప్రభావమే. అయితే ఈ ప్రభావం ప్రజలకు మంచికి ఉపకరిస్తుందా, చెడ్డకు ఉపకరిస్తుందా అన్నది ఆయా కళలయొక్క మంచిచెడ్డలనుబట్టి నిర్ణయించవలసివస్తుంది. నలుగురు విద్యాధికులు కూర్చుని లౌకిక సంభాషణ జరుపుతూ ఏ కాళిదాసు రచనలనుంచో, ఏ షేక్స్పియర్ రచనలనుంచో వాక్యాలు చెప్పుకుంటుంటే వినేవారికి చాలా గౌరవం ఏర్పడుతుంది. సినిమా సంభాషణలు ఏకరువుపెట్టేవారిని చూస్తే అంత గౌరవం ఏర్పడదు. కాళిదాసు సంస్కృతికీ సినిమా చిత్రాల సంస్కృతికీగల వ్యత్యాసమే దీనికి కారణం. సంస్కృతి అన్నదాని విలువను తూర్చలేంగనక దీనినిగురించి మనం కొంత ఆందోళన చెందటం సినిమాచిత్రాలను చిన్నచూపుచూడటం ఎన్నటికీ కాదు. సినిమాచిత్రాలలోకూడా ఉత్తమ సంస్కృతి ప్రతిబింబించాలనే మనమంతా కోరాలి. బాగా సంస్కృతి గలవారు చిత్రాల ప్రభావాన్ని ఆమోదించేట్లు రావాలని కోరుకోవటం ఎన్నటికీ తప్పు కాదు.

ఏ కళకైనా ప్రజలమీదసరిఅయిన ప్రభావం ఉండాలంటే అది ప్రజల సజీవభావాలపైన అభ్యుదయకరంగా-అంటే జీవితాన్ని అభివృద్ధికి తీసుకుపోయేదిగా—ఉండాలి. ఏభావాలైతే ప్రజలకు సరిఅయిన చైతన్యం కలిగిస్తాయో, ప్రజలను ముందడుగు వేయటానికి ప్రేరేపిస్తాయో, ప్రజల విజ్ఞానాన్ని బలపరుస్తాయో ఆ భావాలు కళలద్వారా ప్రజలకు అందాలి. చిత్రాల మంచిచెడ్డలను అంచనా వెయ్యటంలో ఇదొక ప్రమాణం-సర్వోత్తమమైన ప్రమాణం కూడానూ.

అయితే కళలకు ఈ ప్రభావం శాసనాలద్వారానూ, కళాకారుల ఆదర్శవాదంద్వారానూ రాదన్నది నిర్వివాదం. ఇవ్వాళ ఎవరో కొందరు ఆదర్శప్రియులు ప్రజలకు మంచిచేసే భావాలను కొన్నిటిని జాబితా చేసి వాటి ఆధారంపై కొన్ని సినిమా చిత్రాలు తీస్తే అవి చూడటానికి ప్రజలు ముందుకురాక అభ్యుదయవాదంఅపహాస్యం పాలై అసలుకే మోసం జరగవచ్చు. ("అభ్యుదయచిత్రాలెందుకు తీయ"రని కొందరు అమాయకులు చిత్రనిర్మాతలను ప్రశ్నించటమూ, "వాటికయే ఖర్చు మీరిచ్చుకుంటే అట్లాగే తీస్తాము. మీరు అభ్యుదయ చిత్రాలనుకునేవి తీస్తే ఒక్క కానీ రాదని మా దృఢవిశ్వాసం" అని చిత్రనిర్మాతలనటమూ అదివరకే జరిగింది.)

అభ్యుదయసాహిత్యం విషయంలో ఇటువంటి అభాసు కొంత అనుభవంలోకి వచ్చింది. అభ్యుదయ రచనలని ఏరి ప్రచురించినవి కొన్ని ప్రజల ఆమోదం పొందలేదు. ప్రజలపై ఏ భావాలకు ప్రభావం ఉండటం అత్యంత వాంఛనీయమో అటువంటి భావాలు ప్రజల ఆదరణకు అధికంగా పాత్రం కావటం కూడా అత్యవసరం కాదా? ప్రజలు అధికంగా చూసే చిత్రాలు ప్రజలకు ఉపకరించేవి కాక, ప్రజలకు ఉపకరించే చిత్రాలను ప్రజలు చూడక—ఈ సమస్య పరిష్కారమయేదెట్లా?

ఇది పరిష్కారంకాని సమస్య అందామా అనుకుంటే రష్యాలో ఒక చిత్రానికి మొదటివారంలోనే కొన్ని కోట్ల రూబుల్సు ఎట్లా లాభం వస్తున్నది? చైనాలో ఒక చిత్రాన్ని మొదటివారంలోనే కొన్ని కోట్లమంది ఎట్లా చూడటం జరుగుతున్నది?

ఇందులో ఒక రహస్యం ఉన్నది. కేవల వ్యాపారదృష్టితో సినిమాచిత్రాలు తీసేవారు ప్రజలపై సినిమాలకు ఒకరకం ప్రభావం ఉండాలని చూస్తే, ఆదర్శ అభ్యుదయవాదులు మరొకరకం ప్రభావం ఉండాలని ఆదుర్దాపడతారు. ప్రజలకూ చిత్రాలకూ పరస్పర ప్రభావం ఉండాలన్నది సరిఅయిన దృక్పథం.

సినిమా చిత్రాలకు ప్రజలపై సరిఅయిన ప్రభావం ఉండే పరిస్థితి ఏర్పడాలంటే ప్రజాభిప్రాయంయొక్క ప్రభావంకూడా సినిమా చిత్రాలమీద పూర్తిగా ఉండాలి.

ఇప్పుడుకూడా సినిమా చిత్రాలమీద ప్రజల ప్రభావం ఉంటూనేఉన్నది. జనం ఏరకంచిత్రాన్ని ఎక్కువగా చూస్తారని తోస్తే చిత్రనిర్మాతలు ఆరకం చిత్రాలనే తీయటానికి ఆదుర్దాగా ఉంటున్నారు. ఏ తారలు అధికంగా ప్రజామోదాన్ని చూరగొంటే ఆ తారలనే బుక్ చెయ్యటానికి చిత్రనిర్మాతలు ఎగబడుతున్నారు. కాని సినిమా చిత్రాలకు ఈనాడు ప్రజలపైగల ప్రభావం ఎంత హేయంగా ఉంటున్నదో, ప్రజలకు సినిమాలపైగల ప్రభావంకూడా అంత హేయంగానే ఉంటున్నది.

ప్రజలకు సినిమాలపైగల ప్రభావం అభ్యుదయకరంగా ఉండాలంటే అదికూడా సాంఘికభావాల రూపంలోనే ఉండాలి. ప్రజలు తలచుకున్నట్టయితే ఇటువంటి ప్రభావాన్ని వారు చిత్రాలపై ప్రసరింపజేయగలరు. కాని దానికికూడా సాధనాలు కావాలి. మామూలు ప్రేక్షకుడు తనకు నచ్చిన చిత్రాన్ని మరొకసారి చూడగలడు, నచ్చని చిత్రాన్ని నలుగురి ఎదటా తిట్టి ఇతరులు చూడకుండా చేయటానికి తోడ్పడగలడు. ప్రేక్షకుల సమష్టి సాంఘిక భావాల ప్రభావం చిత్రనిర్మాణాన్ని పోకాలంటే పత్రికలూ, సినిమా ప్రేక్షక సంఘాలూ చురుకుగా పని చెయ్యాలి. మంచికిగాని చెడుకుగాని, అమెరికాలో కొన్ని సాంస్కృతిక సంఘాలు తమకు సమ్మతంగాని చిత్రాలు నడవకుండా చెయ్యగల స్థితిలో ఉన్నాయి. (ఈసంస్థలు



వాహినీవారి "మల్లీశ్వరిలో": మల్లీశ్వరిని రాజసౌధంలో చూడవచ్చినతల్లీ, మేనమామలు.

కొన్ని అభ్యుదయకరమైన చిత్రాలనుకూడా నడవనివ్వటం లేదన్నది గమనించాలి.) మన దేశంలో ప్రేక్షకులకు సినిమా చిత్రాలమీద ఎటువంటి ప్రభావమూ లేకపోవటం మటుకు శోచనీయం.

దీనివల్ల ఒక చిత్రమైన చిక్కొకటి కూడా ఏర్పడుతున్నది. ఇటీవల సినిమా రంగంలోకి వచ్చిన చిత్రనిర్మాతలలో జీవిత వాస్తవికతను చిత్రాలలో ప్రతిబింబించాలన్న కాంక్షగలవారు కొద్దిమంది ఉన్నారు. కాని బోలెడంత డబ్బు ఖర్చు చేసి అటువంటి చిత్రాలు తీస్తే ప్రభుత్వం వాటిని బహిష్కరిస్తుందని వారికి భయం. (అది నిరాధారమైన భయం కావచ్చు. కాని ఇప్పుడున్న ప్రభుత్వం వారికి అభ్యుదయ చిత్రాలు తీసే ధైర్యం ఇవ్వకపోవటం ప్రభుత్వం తప్పు. కాకపోయినా, ప్రజాదరణ పొందిన అభ్యుదయ నాటకాలను బహిష్కరించిన ప్రభుత్వం అభ్యుదయ చిత్రాలను సహిస్తుందన్నమాట అనుమానాస్పదమే.) కాని ప్రేక్షక ప్రజానీకం తనకు నచ్చిన చిత్రాలను గట్టిగా బలపరుస్తుందన్న ధైర్యం ఉంటే ఈనాటి చిత్ర నిర్మాతలలో ఏ ఒకరిద్దరైనా, కేవలవ్యాపార దృష్టితో గాక, అభ్యుదయయుతమైన సాంఘిక దృష్టితో చిత్రాలు తీయవచ్చు. ప్రజలకూ సినిమా కళకూ మధ్య ఇటువంటి సంబంధ బాంధవ్యాలు ఏర్పడేదాకా ఆకళ వల్ల జాతికీ, దేశానికీ, సంఘానికీ ఏమో ఒనగూడుతుందనుకోవటం శుద్ధభ్రమ. ★





"పాలేరు"లో రైతు చనిపోయేదృశ్యం

రషెస్:

## పాలేరు

టి. కె. ప్రొడక్షన్సువారి 'పాలేరు' చిత్ర నిర్మాణం గోపీచంద్ గారి దర్శకత్వం కింద శోభనాచల స్టూడియోలో చురుకుగా సాగుతున్నది. ఈ చిత్రంలో 'పాలేరు' వాస్తవిక దృక్పథంగల అహింసావాది. "విన్నావా అన్నా ఓరన్నా, వేమన చెప్పినవేదం, విలువకు దొరకని జ్ఞానం, జాతులెన్నో రీతులైనా, నీతిమాత్రం ఒక్కటన్నాడూ, ఈ నీతి ఒక్కటె నిత్యమన్నాడూ, ఇది సత్యమన్నాడూ."

ఈ తత్వం జీర్ణించుకొని దేశ సౌభాగ్యానికి అహింసాయుత మార్గమే సాధనమని నమ్మి ప్రవర్తించే వ్యక్తి పాలేరు. ఈపాత్రను నిర్వహిస్తున్న గోవిందరాజుల సుబ్బారావుగారు పాత్రలో ఇమిడిపోయి భావస్ఫోరకంగా నటిస్తున్నారు. రైతు కుమార్తె కమల, వయస్సులో చిన్నదైనప్పటికీ అన్యాయాన్ని ధైర్యంతో ఎదుర్కొనే దిట్ట. ఈ పాత్రను జానకి కడు సామర్థ్యంతో నిర్వహిస్తున్నది. రామ్మూర్తి నిర్వహించే ఇంటి అల్లుడు పాత్ర చాల సున్నితమైన హాస్యంతో కూడుకొని ఉన్నది. కోడూరి అచ్చయ్యగారి 'రైతు' పాత్ర ప్రేక్షకుల మన్ననలనందుకొంటుంది.

గుమాస్తాగా వంగర నటనలో ఒక ప్రత్యేకత కనుపిస్తుంది. ఈ చిత్రంలో పాత్రౌచిత్యము, పాత్రపోషణ చక్కని మోతాదులో ఉంటున్నాయి. పాత్రలన్నీ సజీవమైనటువంటివి. శ్రీ శ్రీ గారి పాటలు భావప్రధానంగా తమ ప్రత్యేకతను వెల్లడించుకొంటూ రసపుష్టిని కలిగిస్తున్నాయి. మచ్చునకు "రాజ్యాలే పోయినా, లోకాలే మారినా, పొలంమీద హలంబూని, పాలేరున్నంతవరకు, దేశానికి దీసనైన సరితే లేదోయ్." గోపీచంద్ గారు ప్రతి పాత్ర విషయంలోను తగినశ్రద్ధ తీసుకొంటూ సన్నివేశాలను రసపుష్టిగా సృష్టిస్తున్నారు. ఈ చిత్రంలో 'రైతు' బండిమీదనుండి పడి దెబ్బలు తగిలి మరణిస్తాడు. ఈ సన్నివేశం ప్రేక్షకుల హృదయాలను కదలించేటట్లుగా ఉంది. పాలేరు చిత్రం గోపీచంద్ గారి ప్రతిభకు ఒక నమూనాగా ఉండగలదని రషెస్ చూసినమీదట అనిపిస్తోంది.

## విజయావారి "పెళ్లిచేసిచూడు"

ఈ చిత్రం షూటింగు దాదాపు అయిపోయింది. దీని రషెస్ చూస్తుంటే, ఇంతకాలానికి తెలుగులో నిజమైన హాస్యచిత్రం వస్తున్నదనిపించింది. ఎందుకంటే ఇంచుమించు ప్రతి చిత్రంలోనూ హాస్యం ఉంటున్నప్పటికీ, ఆహాస్యంకోసం హాస్యపాత్రలూ, హాస్య సన్నివేశాలూ ఉంటున్నాయి. కాని ఈ చిత్రంలో గల హాస్యం నిర్వచనానికి అనుగుణమైనది. ఏ పాత్ర అయినా తన ఆశయాలకు విరుద్ధమైన పరిస్థితిలో చిక్కుకునేసరికి హాస్యం సృష్టి అవుతుంది. "పెళ్లి చేసి చూడు"లో హాస్యం ఇదే ధోరణిలో

ఉన్నది. చిన్నప్పటినుంచీ చిట్టిని పెళ్లాంగా చూసుకునే బంధువాడూ, తన చెల్లెలుకు సంబంధం వెతుక్కు రావటానికి బయలు దేరిన రాజూ, ఉన్న ఆస్తిఅంతా ఇల్లు కట్టటానికి ఖర్చు చేసి కనపడ్డవారందరికీ సహాయం చేసే వియ్యన్నా, తనను బ్రహ్మదేవుడు కూడా మోసం చెయ్యలేడనే దర్పంగల విశ్వపతీ, స్వార్థంకోసం అందరి నెత్తినా చెయ్యిపెట్టే గోవిందయ్యా తమ తలలకు మించిన పరిస్థితులకు గురిఅయి హాస్యం పుట్టిస్తారు.

ఇంకో విషయంలోకూడా "పెళ్లిచేసి చూడు"లో హాస్యం ప్రత్యేకత కలిగి ఉన్నది. అదేమిటంటే, హాస్యం కరుణకు ఎంత సన్నిహితంగా ఉంటుందో ఈ చిత్రంలో చూడవచ్చు. అందుకనీ ఈ చిత్రంలో కరుణరసంతో కూడుకున్న ఘట్టాలు ఎన్ని ఉన్నా వాటిమీద హాస్యం అతుకులాగా ఉండదు.

"పెళ్లిచేసిచూడు" రషెస్ చూస్తుంటే హాస్యనటులలో జోగారావుకు ఒక ప్రత్యేక స్థానం ఉన్నట్టనిపించింది. ఎందుచేతనంటే హాస్యానికీ కరుణకూ గల సన్నిహితత్వాన్ని అతను ఎన్నోచోట్ల స్వయంగా ప్రదర్శించాడు. "షావుకారు"లో రౌడీ పాత్రా, "పాతాళభైరవి"లో నేపాళ మాంత్రికుడి పాత్రా ధరించిన రంగారావు ఈ చిత్రంలో వియ్యన్న పాత్ర ధరించి హాస్యం నటిస్తున్నాడు. రంగారావు ఆడవేషంతప్ప ఏదన్నా నిర్వహించగలడేమో ననిపిస్తుంది.

ప్రాణంగల పాత్రలనూ, సన్నివేశాలనూ సృష్టించటంలోనూ, పాత్రోచితమై సందర్భోచితమైన సంభాషణలు రచించటంలోనూ చక్రపాణికి పోటీ ఉన్నట్టు కనపడదు. ఉత్తమ సాహిత్య రచనా సామర్థ్యాన్ని చిత్రాలలో ప్రదర్శిస్తున్నది చక్రపాణి ఒకడే. విమర్శకులకు ఆలోచించినకొద్దీ పనితనం చూపించిన చిత్రం షావుకారు." మళ్లీ "పెళ్లిచేసిచూడు" అదే ధోరణిలో ఉన్నది. డైరెక్షన్‌లో ప్రసాదు సరిగా చక్రపాణివంటివాడే. ఒక భావాన్ని వ్యక్తం చెయ్యని పాటుగాని, తన స్వంత సృష్టి ప్రదర్శించని పాటుగాని ప్రసాదు తియ్యడు.

ఘంటసాల సంగీతంకూడా చిత్రం యొక్క "స్పిరిట్"కు అనుకూలంగా ఉంది. చాలామంది సంగీతదర్శకులు తమ ప్రత్యేకత తాము ప్రదర్శించుకోగలరే గాని చిత్రంయొక్క ప్రత్యేకతను తమ సంగీతంలో ప్రతిబింబించలేరు. ఈ చిత్రంలో ఘంటసాల ఆయా పాత్రలకూ, సన్నివేశాలకూ తగిన సంగీతం ఇస్తున్నాడు.

ఎన్ని అనుకున్నా, చిత్రం బాగుండాలంటే దానికి ఒకలక్షణం విధిగా ఉండాలి. అదేమిటంటే అది చూసేవారికి, "ఈచిత్రం తీయటంలో పనిచేసినవారంతా ఎంతో ఆత్మసంతృప్తితో పనిచేశారు," అన్న భావం స్ఫురించాలి. "పెళ్లిచేసిచూడు" రషెస్ చూస్తుంటే ఈభావం ప్రతి అంగుళంలోనూ కనిపిస్తుంది. రషెస్ చూస్తున్న మూడుగంటలూ కూడా మామూలు ధోరణిలో తెలుగుసినిమాచిత్రం చూస్తున్నామన్న భావం కలగనే కలగదు. అతి చిన్న పాత్రలకుగూడా ఎంతో ప్రాముఖ్యం ఇవ్వబడింది. ఈ చిత్రాన్ని చూసి తెలుగు ప్రేక్షకులు ఆనందించి తీరుతారన్న ఆశ కలుగుతోంది.

# ★ సినిమావార్తలు ★

## ప్రియురాలు

భారతలక్ష్మీ ప్రొడక్షన్సువారు నిర్మిస్తున్న సాంఘిక చిత్రం 'ప్రియురాలు' సగంపైగా పూర్తి అయింది. కథకులు దర్శకులు, శ్రీగోపీచంద్. సంగీత దర్శకులు శ్రీరాజేశ్వరరావు, శ్రీఅద్దేపల్లి. పాటలను శ్రీ అనిసెట్టి సుబ్బారావు, శ్రీ రజనీకాంతరావు వ్రాశారు. నృత్య దర్శకుడు మాస్టరు హీరాలాల్. కళ శ్రీ టి. వి. ఎస్. శర్మ. ఛాయాగ్రాహకులు శ్రీ అన్నయ్యా శ్రీ బోళ్ళ సుబ్బారావు.

ఇందులో లక్ష్మీకాంత, కృష్ణకుమారి, సావిత్రి, కనకం, జగ్గయ్య, రేలంగి, చంద్రశేఖర్, వెంకటేశ్వరరావు, రామమూర్తి, కొండయ్య, సుబ్బారావు, రామమోహనరావు మున్నగువారు నటిస్తున్నారు.

## సొసైటీ పిక్చర్సువారి సాంఘిక చిత్రం

సొసైటీ పిక్చర్సువారు తెలుగు తమిళ భాషలలో ఒక సాంఘికచిత్రం తీస్తున్నారు. దీని కింకా పేరు పెట్టలేదు. దాదాపు మువ్పాతికవంతు పూర్తి అయింది. కథకులు శ్రీ ఎం. హెచ్. మూనాస్. సంభాషణలు, పాటలు శ్రీ శ్రీ గారు వ్రాశారు. దర్శకుడు ఎల్. ఎస్. రామచంద్రన్. సంగీత దర్శకుడు జ్ఞానమణి. సహాయకుడు పూర్ణానందం. తెలుగు చిత్రంలో నాగయ్య, రఘురామయ్య, జి. వరలక్ష్మి, జానకి, కాంచన్, వి. నరసింహారావు, సుబ్బారావు, కనకం, ఛాయాదేవి, రామమూర్తి, కోటేశ్వరరావు, లలిత, పద్మిని మున్నగువారు నటిస్తున్నారు.



"పెళ్లి చేసి చూడు"లో పుష్పలత, వెంకయ్య

## ★ కర్దార్ - కోలినోస్ - "టెరిజా" అందాలపోటీ ★



ఉత్తమ బహుమతిపొందిన పురుషుడు సహదేవరాణా

## వినోదావారి కొత్త చిత్రాల ప్రారంభం

వినోదావారు అక్టోబరు 24 న తమకొత్త చిత్రాలకు ప్రారంభోత్సవం చేశారు. మద్రాసు రేవతీ స్టూడియోలో సాయంకాలం ఈ ఉత్సవం జరిగింది. అనేక మంది పెద్దలు విచ్చేశారు. వేదాంతం రాఘవయ్య నిర్వహణతో తెలుగు, తమిళ భాషలలో "దేవదాసు" సముద్రాల రాఘవాచార్యులు నిర్వహణతో తెలుగులో "బాలసన్యాసమ్మ కథ" ప్రారంభించబడ్డాయి. వీటితోబాటు పేరుపెట్టని మరొక చిత్రం కూడా తయారు కాబోతున్నట్టు తెలుస్తున్నది. ఆ రాత్రే వినోదావారి ఆఫీసులో అతిథులకు విందు కూడా జరిగింది.

డి. ఎల్. నారాయణ పర్యవేక్షణ కింద వినోదా సంస్థ కొద్ది కాలంలోనే చక్కని పునాది వేసుకుని నిలకడగా చిత్రాలుతీసే అర్హతగల కొద్ది తెలుగు సంస్థలలో స్థానం సంపాదించుకోనటం ప్రశంసనీయం. ఈ సంస్థలో భాగస్వాములందరూ చిత్ర నిర్మాణంలో విశేషానుభవం కలిగి ఉండటమే దీనికి కారణం. వీరి తొలి చిత్రం "స్త్రీ సాహసం" ఈ యేడు తయారైన విజయవంతమైన చిత్రాలలో ఒకటి. ఇక ముందు వీరు తీసే చిత్రాలు ఇంకా అధికమైన విజయం సంపాదించి ఈ సంస్థను పైకి తీసుకురాగలవని ఆశించవచ్చు.

## రిక్షావాలా

దయానా పిక్చర్సువారు తీస్తున్న సాంఘిక చిత్రం 'రిక్షావాలా' దాదాపు నాల్గవవంతు పూర్తి అయింది. నిర్మాత శ్రీ కె. రామచంద్రరావు. దర్శకుడు శ్రీ సి. ఎస్. ఆర్. సహాయకుడు శ్రీ వైకుంఠ రామశర్మ. సంగీత దర్శకుడు శ్రీ అశ్వత్థామ. రచన, పాటలు శ్రీ 'ఆరుద్ర'. నృత్యం శ్రీ వెంపటి చినసత్యం. కళ శ్రీ సి. హెచ్. ప్రసాద్. కెమెరా శ్రీ బోళ్ళ సుబ్బారావు. శ్రమజీవియొక్క సాంఘిక విలువను నిరూపించే చిత్రం ఇది. ఇందులో సి. ఎస్. ఆర్. రామచంద్ర కాశ్యప, కేశవరావు, సి. హెచ్. కుటుంబరావు, మాస్టరు శేషాద్రి, రాధాకృష్ణమూర్తి, పెరుమాళ్ళు, చంద్రకుమారి, వసంత, బేబీ మల్లిక, బేబీ సుమిత్ర, భూదేవి మున్నగు వారు నటిస్తున్నారు. చిత్రం నిర్మాణం ఖర్చులు బాగా పెరిగిన ఈరోజుల్లో కొత్త నటీనటులతో సి. ఎస్. ఆర్. గారు అభ్యుదయకరమైన సాంఘిక చిత్రమును నిర్మిస్తున్నందుకు వారెంతైనా అభినందనీయులు.

## సినిమా ప్రముఖుల రష్యా యాత్ర

ఇటీవల రష్యా ప్రభుత్వం వారి ఆహ్వానంపై కొందరు భారతీయ సినిమాప్రముఖులు రష్యా వెళ్లి అక్కడ 26 రోజులు పర్యటనచేసి తిరిగి వచ్చారు. వీరిలో దక్షిణ దేశానికి సంబంధించినవారు ప్రఖ్యాత హాస్యనటుడు ఎన్. ఎస్. కృష్ణన్, అతని జోడు మధురం, తమిళ సినిమా డైరెక్టరు కె. సుబ్రహ్మణ్యం. ఈ సందర్భంలో వీరికి అక్టోబరు 26 న మద్రాసు "వుడ్ లాండ్స్"లో సౌత్ ఇండియా ఫిలిం చేంబర్ వారు ఘనమైన స్వాగతం ఏర్పాటు చేశారు. దరిమిలాను 29 వ తేదీ సాయంకాలం నాటక కపగం వారు ట్రిప్లికేన్ బీచిలో మీటింగు ఏర్పాటు చేశారు. ఈ మీటింగులో ఎన్. ఎస్. కృష్ణన్ మాట్లాడితే వినటానికి దాదాపు లక్ష మంది ప్రేక్షకులు హాజరయారు. (మద్రాసులో ఎట్టి రాజకీయ సమావేశానికి కూడా అయిదారు వేలమందికి మించి హాజరుకారు.)

"వుడ్ లాండ్స్"లో జరిగిన సన్మా

నంలో మాట్లాడుతూ డైరెక్టరు సుబ్రహ్మణ్యం, "మేము ఏ ఇంగ్లండో అమెరికావో వెళ్లివస్తే మాకు వీడ్కోలు సన్మానాలుగాని స్వాగత సన్మానాలుగాని ఉండేవి కావు," అన్నాడు.

ఈ రష్యా యాత్రికులు చెప్పేదాన్ని బట్టి రష్యాలో కళలకు చాలా ఆదరం ఉన్నది. అక్కడ ప్రభుత్వంలో విదేశాంగ శాఖ తరవాత సినిమా శాఖ అతి ముఖ్యమైనది. కళాకారులు రాజ్యభారంలో ప్రముఖ పాత్రకూడా నిర్వహిస్తున్నారు. రష్యాలో సినిమా పరిశ్రమలో ప్రవేశించగోరే ప్రతివాడికీ తగిన శిక్షణా, శిక్షణానంతరం డిప్లొమా ఇవ్వబడతాయి. డిప్లొమా లేకుండా ఎవరూ సినిమాలో ప్రవేశించలేరు.

సుబ్రమణ్యం, కృష్ణన్‌గార్లిద్దరూ తమ అనుభవాలను పత్రికాముఖాన వెలువరించగలమని మాట ఇచ్చారు. వారు చెప్పేవాటిలో కొన్ని అయినా మన పరిశ్రమలో అనుసరణీయాలుగా ఉంటవని ఆశించవచ్చు.

## "ఆశ"

జయషాపిక్చర్స్‌వారి "ఆశ" చిత్ర ప్రారంభోత్సవం అక్టోబరు 31 బుధవారం నాడు రేవతీ స్టూడియోలో జరిగింది.

ఈ చిత్రంలో లింగమూర్తి, జయమ్మ, సి. హెచ్. నారాయణరావు మొదలైనవారు నటిస్తున్నట్టు తెలుస్తున్నది.

## ఫిలిం విచారణ సంఘ నివేదికపై వ్యాఖ్య

దక్షిణ భారత సినిమా స్టూడియో సంఘంవారు నవంబరు 2న ఎస్. ఎస్. వాసన్ (జెమినీ) అధ్యక్షతన సమావేశమై, ఇండియా ఫిలింపరిశ్రమను అన్నివిధాలా శాసించే ప్రభుత్వంచేత నియోగించబడిన ఫిలిం విచారణ సంఘంవారి నివేదికను వివరంగా పరిశీలించారు.

వివిధంగానైనాసరే చిత్రనిర్మాతల నేచ్ఛకు అంతరాయం కలిగించే వాటినన్నిటినీ ఖండించాలన్న వైఖరి అవలంబించబడింది. ఈ దృష్టితో పై సంఘంవారు ప్రొడక్షన్‌కోడ్ ఎడ్మినిస్ట్రేషన్‌ను పూర్తిగా ఖండించారు. ఈ శాఖకు స్క్రిప్టులపైనా, సినిమాకథల తయారీపైనా, ఇతర చిత్రనిర్మాణ కార్యకలాపంపైనా అధికారం ఉంటుంది.





ఉత్తమబహుమతి పొందినస్త్రీ పీస్‌కమల్

అధికారాలు ఫిలిం కౌన్సిలు కుండటం కూడా వారు గర్హించారు.

చిత్రనిర్మాణ పరిశోధనలను సాగించాలన్న సూచనను వీరు ఆమోదిస్తూ తను సహకారాన్ని కూడా ఇవ్వడానికి నిర్ణయించారు. భారతీయ చిత్రాలకు ఇతర దేశాలలో వ్యాప్తి కలిగించడానికై సూచించబడిన ఏర్పాట్లనుకూడా వీరు ఆమోదించారు. పర్మనెంటు థియేటర్ల నిర్మాణానికి, ఆరు బయలు థియేటర్లనూ ప్రోత్సహించడమూ, ఒకే ప్రభుత్వశాఖక్రింద సినిమా, రేడియో, పత్రికలూ, ప్రచారమూ మొదలైనవి చేర్చి వీటన్నిటినీ సమన్వయించడమూకూడా వీరు ఆమోదించారు.

అన్నితరగతుల సినిమా టిక్కెట్లపైనా ఒకేవిధంగా వినోదపన్ను ఉండడం వారికి సమ్మతమేగాని నూరింట 20 వంతుల పన్ను చాలా ఎక్కువేననీ, సినిమా కేవల వినోద వస్తువే ననుకొన్నా, మామూలు వినోద వస్తువులపైగల అమ్మకంపన్నుతో పోలిస్తే ఇది చాలా అధికంగా ఉన్నదనీ భావించారు. సెన్సార్ సర్టిఫికేట్లలో "ఎ" "యు" (పెద్దలకు మాత్రమే, అందరికీ) అన్న విభజన అనుచితమూ, అనవసరమూ అని స్టూడియో సంఘంవారు భావించారు. ★



పచ్చప్పాకళాశాలవారి ఆంధ్రసాహిత్య సమితి యాజమాన్యమున జరిగిన నాటికల పోటీలలో "ఉత్తమనటుడు"గా నిర్ణయింపబడిన కాలేజివిద్యార్థి ప్రభాకరరావు.



రెండవ బహుమతిపొందిన చాంద్ ఉస్మాన్

## కాంచనద్వీపం

(31 వ పేజీ తరువాయి)

ఎప్పుడూ దేవుణ్ణి ప్రార్థనచేసుకుంటూ, వాళ్ళమ్మని తలుచుకుంటూ, ఉన్నాట్ట. కాని చాలాకష్టపడి చివరికి ఫ్లింట్ రహస్యాన్ని కనిపెట్టాడట; అని చెప్పండి. ఏమిటా రహస్యమని ఆయనడిగితే ఇదిగో ఇల్లా కన్నుగీటండి. ఏం, తెలిసిందాండి."

"సరే. చెబుతాను. కాని నేను ఓడలోకి వెళ్ళటమెల్లా? రావటమంటే సిల్వర్ వాళ్ళబోట్లలో వచ్చాను. కాని యీసారి నన్ను చూడగానే వాళ్లు చంపేస్తారు;" అన్నాను దిగులుగా.

"నేనున్నాను గదండి. నేనిన్నాళ్లూ ఏం చేస్తున్నా ననుకున్నారు? ఓ మంచిబోటు తయారుచేశాను ఆముక్కా యీ ముక్కా చేర్చి. ఓడరేవుకు తూర్పుగా తెల్లగుట్ట అనివుందే అక్కడ చెట్లచాటున దాచానుదాన్ని. కావలిస్తే చీకటిపడ్డాక వీలవుతుందేమో చూద్దాం......ఏమిటది?" అని అదిరిపడ్డాడు బెన్‌గన్. నేనుకూడా అదిరిపడ్డాను.

ఎందుకంటే, మాఓడ దిశనుండి ఢామ్మని ఫిరంగిమోత వినిపించింది. సూర్యాస్తమయానికి ఇంకా గంట రెండుగంటల పైమువుంది. కనుక ఆఫిరంగి కెప్టెన్ స్మాలెట్ పేల్చినదైవుండదు. కనుక ఏదో గొడవ ప్రారంభమై వుండాలి.

"యుద్ధం మొదలుపెట్టారల్లే వుంది," అన్నాను కంగారుగా. వెంటనే రేవుకేసి పరిగెత్తసాగాను. నాపక్కన బెన్‌గన్ అతి తేలిగ్గా లేడివలె చెంగు చెంగున ఎగురుతూ వస్తున్నాడు.

"ఈపక్కగా రండి. ఇటు, ఇటు. ఎడమవేపు చెట్లకిందగా పరిగెత్తండి. చూడండి ఇక్కడే నేను మొట్టమొదటి గొర్రెను చంపాను. ఇక్కడకి అప్పుడప్పుడువచ్చి దేవుణ్ణి ప్రార్థిస్తూ వుంటాను......" ఇలా మాట్లాడుతూ అతడు నాతోపాటు పరిగెత్తుతూ వస్తున్నాడు.

ఫిరంగిమోత వినబడిన చాలసేపటికి ఢామ్ ఢామ్మని తుపాకులుపేలిన చప్పుళ్లు క్రమంగా ఎక్కువయ్యాయి. యుద్ధం జోరుగా జరుగుతోందన్న మాట. ఇంకా కొంతదూరం పరిగెత్తాము. హఠాత్తుగా ఒక పావుమైలు దూరంలో ఎదురుగా 'యూనియన్ జాక్' జెండా కనిపించింది. చెట్లపైగా అస్తమయ సూర్యుడి ఎర్రకాంతిలో ఇంకా ఎర్రగా మెరిసిపోతూ కనపడింది.

(ఇంకావుంది.)

## కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో

(7-వ పేజీ తరువాయి)

ఆమె నేరస్థురాలని నేను నిరూపిస్తాను. న్యాయాధికారిగా మీ కర్తవ్యం నిర్వహించండి."

"అయ్యో! నే నెలా భరించగలను. డాక్టర్! నన్ను రక్షించండి. నా ప్రతిష్ఠ కాపాడండి."

"మీ కూతురు ముగ్గురి ప్రాణాలు తీసింది! ఇంకా మీ ప్రతిష్ఠ గురించి మాట్లాడతా రెందుకు? నే చెప్పినట్లు చెయ్యండి. మీ కీర్తి చిరస్థాయిగా నిలిచిపోతుంది."

విల్‌ఫర్ట్ డాక్టర్ ముందు మోకరిల్లి దీనంగా ప్రార్థించాడు. "నా పాపాల నే ననుభవిస్తాను. నా మానన నన్ను విడిచి పెట్టండి."

డాక్టర్ కొంతసేపు మౌనంగా ఊరుకున్నాడు. తరవాత "కాని మీరు జాగ్రత్తగా ఉండండి. మీ తండ్రి తరవాతి మీ భార్యకు, మీ కుమారుడు ఎడ్వర్డ్‌కి ప్రమాదం సంభవించవచ్చు. తరవాత విచారించి ప్రయోజనం లేదు."

విల్‌ఫర్ట్ లేచి డాక్టర్ చేతులు పట్టుకున్నాడు. "వినండి, నా కూతురు హంతకి కాదు. యుమ్మాత్రికీ కాదు. నాకు తెలుసు, నేను నా బిడ్డను రక్షించుకోలేను. ఆమెను శిక్షించలేను. ఆమె కే బాధ కలిగినా నేను బ్రతకలేను. ఇందులో పొరపాటే జరిగిఉంటే నే ననుభవిస్తాను. మీరు చెప్పినదే నిజమైతే నే నెలాగూ బ్రతకలేను. నా కదే మేలు.

"సరే, కానివ్వండి. కాని మీ యింటిలో మళ్లీ ఎవరికైనా ప్రాణాపాయం సంభవించినట్లయితే వైద్యానికి నేను రాను."

"బారోయ్ చావు కేం చెప్పాలి?"

"నేను చెప్తాను" అంటూ డాక్టర్ వరండాలోకి వెళ్లాడు. సమీపంలోనే పరిచారకు లందరూ గుమిగూడి గుసగుస లాడుకుంటున్నారు. డాక్టర్ వారిని సమీపించి "బారోయ్ మూర్ఛరోగం వల్ల చనిపోయాడు. వృద్ధుని పరిచర్యలోనే దివారాత్రాలు కృషి చేసినందువల్ల సత్తువ ఉడిగిపోయింది. శవాన్ని తీసుకువెళ్లి అంత్యక్రియలు జరిపించండి." అన్నాడు.

విల్‌ఫర్ట్ కన్నులు తుడుచుకున్నాడు. డాక్టర్ తిరిగి చూడకుండా వెళ్లిపోయాడు. వాలంటైన్, హిలాయ్ విల్‌ఫర్ట్ లోనికి వచ్చారు. పరిచారకు లందరూ లోనికి వచ్చారు. "ఈ యింటికి నేదో ఆవహించింది. ఇక్కడుంటే మాకు కూడా చావు తప్పదు" అన్నారు. పనివిడిచి వెళ్లిపోవాలని అందరూ నిశ్చయించుకున్నారు. యజమాను లెంత బ్రతిమాలుకున్నా వినలేదు. వాలంటిన్‌పట్ల ప్రీతిపూర్వకంగా చూసి "అమ్మా! మీ మీ ఇంటిలో ఉండలేం. మీకోసమైనా ఉండవలసిందే కాని మా కింక ధైర్యం లేదు. మీరు మాత్రం జాగ్రత్తగా ఉండండి. మీకు ఎలాటి భయం కలిగినా, ప్రమాదం వచ్చినా మాకు కబురు పంపండి" అని చెప్పి వెళ్లిపోయారు. కన్నీటితో తడిసిన వాలంటైన్ ముఖంవంక విల్‌ఫర్ట్ వింతగా చూశాడు. తరవాతకొంకొ సంకోచాలతో తన భార్యవంక చూశాడు. భార్య పెదవులపై అస్పష్టమైన చిరునవ్వు గోచరించింది. విల్‌ఫర్ట్ ఉలిక్కిపడ్డాడు. ★



## మినువాక (నవల)

రచయిత: వి. డి. ప్రసాదరావు; వెల 2-0-0; ప్రతులకు వి. డి. ప్రసాదరావు, సాహిత్యవశేయ ప్రచురణలు, 8. నాదముని స్ట్రీటు, త్యాగరాయనగరు, మద్రాసు.

భర్త, బిడ్డ తప్ప వేరే ప్రపంచంలేని స్త్రీ శశికళ. ఆ ఇరువురూ ఆమెను దుఃఖంలో ముంచి చనిపోతారు. ఇష్టంలేకపోయినా ఆమె గత్యంతరంలేక అన్నగారింటిలో ఆశ్రయం పొందుతుంది. అక్కడి పరిస్థితు లామెకు సరిపడవు. తన శీలానికికూడా ముప్పు ఏర్పడనున్న సందర్భంలో ఆమె అన్న ఇంటిని వదలి రైలెక్కి ఎక్కడికో తెలియకుండా బయల్దేరుతుంది. రైల్లో వితంతు శరణాలయ అధికారవర్గానికి చెందిన దంపతు లిరువురు తారసిల్లి శశికళను తమ శరణాలయానికి తీసుకుపోతారు. ఆమె మొదటిసారిగా ఆధునిక ప్రపంచంలో అడుగుపెడుతుంది. తన నాదరించిన దంపతుల ప్రోత్సాహంతో ఇంగ్లీషువిద్య నభ్యసించి బి. ఏ. లో ఉత్తీర్ణురాలవుతుంది. స్వతంత్రజీవనం గడపడాని కుద్యమించి ట్యూషన్లు చెప్పుకుంటూండగా భాస్కరరావనే నడివయస్కుడు, ధనికుడు ఆమెను వివాహమాడగోరుతాడు. ఆమె మొదట నిరాకరించి, చివరకు వివాహమాడుతుంది. అతని స్వరూపం, స్వభావం, అలవాట్లు అన్నిటినీ ఆమె ఏవగించుకొంటుంది. చివరకు అంతరాత్మతో గొప్ప సంఘర్షణపడి పరివర్తన పొందుతుంది. రెండవభర్తను ఎట్టి వికారమూలేని హృదయంతో స్వీకరిస్తుంది.

ఈ నవలలో మనస్తత్వ పరిశీలనకు ప్రాధాన్యం వున్నది. శశికళ తన మనస్సును ఎప్పటికప్పుడు ఆవలోడన చేసుకోవటమే కాకుండా ఇతరుల మనస్సులనుకూడా అంచనాకట్టే స్వభావంగలది. ఇతరులలో ప్రయత్నపూర్వకంగా మంచినే చూడటానికి, లోపాలను తనకే అంటగట్టుకోటానికి ఆమె యత్నిస్తుంది. ఈ యత్నంలో ఆమె కృతకృత్యురాలైనట్లే రచయిత అఖరులో సూచిస్తారు. అందుకు దోహదంగా ఆమెకు జబ్బుచేసి స్మృతిలోలేని సమయంలో, భగవద్గీతలో అర్జునునకు విశ్వరూపదర్శనం అయినట్లు శశికళకు జగత్పరిణామంలో కలిగిన, కలగనున్న వివిధ దశలు ప్రదర్శితమాతాయి. ఆమెకు జబ్బు నయమై తేరుకొన్న తర్వాత హరజటాజూటగళితమై భూలోకపు సకల పాపాలు తనలో కడిగివేసుకుంటూ, తాను మాత్రం కళంకిత కాకుండా నిల్చిన ఆకాశగంగ ("మినువాక") స్థితిని తాను పొందినట్లు ఆమెకు స్ఫురిస్తుంది. అందుచేతనే రాగద్వేషాది చిత్తవికారాలకు అతీతమైన స్థితప్రజ్ఞతతో రెండవభర్తతో జీవితం గడప నిశ్చయించుకుంటుంది.

కరుణరస ఘట్టాలను ఈ రచయిత చాల హృదయంగమంగా వర్ణిస్తారు. శశికళ మొదటిభర్త జబ్బుతో ఉన్నప్పుడు, అతడు, బిడ్డ చనిపోయినప్పుడు శశికళపొందే వేదన పాఠకులను కలచివేస్తుంది.

ఈ నవలలో రెండురకాల పాత్రలున్నారు: మంచివారు, చెడ్డవారు. మంచివారికంటె చెడ్డవారే ఎక్కువమంది. చెడ్డవారొకవేళ మంచిగా ప్రవర్తించినా, ఆ ప్రవర్తనకు వెనుకనున్న మనస్తత్వము వారి అసలుగుణాన్నే సమర్థిస్తుంది. ప్రతి పాత్ర మనస్తత్వాన్ని పరిశీలించే ఈ రచయిత మంచి పాత్రల మనస్తత్వాన్ని పరిశీలించక వదలివేస్తారు.

సంఘటనలకంటె మనస్తత్వమే ప్రధానమైనా, ఈ నవల తుదివరకూ విసుగు కలిగించకుండా చదివించగలదు. అందరూ చదువదగిన నవల.

---

## స్వీకారం

ఆంధ్రప్రజ:— (ప్రజా సామాన్య మాసపత్రిక) కంభంపాటి సత్యనారాయణగారి సంపాదకత్వాన బొంబాయినుండి వెలువడుతున్న ఈ మాసపత్రిక మొదటి సంచిక (నవంబరు నెలది) మా కార్యాలయానికి చేరింది. విడిప్రతి వెల 0—6—0; సాలు చందా 4—0—0; చిరునామా: పోడార్ ఛేంబర్సు, పార్సీ బజార్ స్ట్రీట్, బొంబాయి—1. ★

## కాశ్మీరురాజ్యాంగ పరిషత్సభ

(4-వ పేజీ తరువాయి)

రాజ్యాంగ భవిష్య నిర్ణయం భద్రతా మండలి తోడ్పాటువల్ల లభిస్తుందనే విశ్వాసం కాశ్మీర్ ప్రజలకు నశించింది.

భద్రతామండలి లోపాల మూలంగా కాశ్మీర్ దేశానికి ప్రజాప్రాతినిధ్య పరిపాలన ఇంతవరకు లభించలేకపోయినందువల్ల, ఇంకెంతమాత్రం జాప్యం సహించలేకపోయిన కాశ్మీర్ ప్రభుత్వం రాజ్యాంగ పరిషత్సభను ఏర్పాటుచేసింది. రాజ్యాంగ పరిషత్సభను ఏర్పాటు చెయ్యరాదని భద్రతామండలి ఆదేశించింది. అయితే ముందు జరగనున్న ప్లెబిసైట్‌కు ప్రస్తుత రాజ్యాంగ నిర్మాణమూ, ప్రజాప్రాతినిధ్య ప్రభుత్వ స్థాపనమూ అడ్డురావనీ, రాజ్యాంగ పరిషత్సభవల్ల 'ప్లెబిసైట్' నిర్ణయానికి ఎట్టి భంగం కలుగబోదనీ, ప్లెబిసైట్ నిర్ణయానికి భారతప్రభుత్వం కట్టుబడి ఉంటుందనీ భారత ప్రధాని నెహ్రూ ప్రకటించారు. ప్లెబిసైట్ జరిగేవరకూ (అదెప్పుడు జరుగుతుందో భద్రతా మండలి కార్యకలాపాల మూలంగా చెప్పడం కష్టం) ప్రజాస్వామ్య పరిపాలన ప్రారంభించడం ఆగవలసిన అవసరం లేదనీ, అలా ఆపడానికి ఎవరికీ, చివరకి భారత ప్రభుత్వానికి కూడా హక్కు లేదనీ నెహ్రూ అన్నారు. ప్లెబిసైట్ ఎప్పుడు నిర్వహించబడినప్పటికీ దానితో నిమిత్తం లేకుండా ఈలోగా ప్రజల ప్రతినిధుల పరిపాలనను నెలకొల్పడం అవసరమౌతున్నది. కాశ్మీర్ ప్రజల ఆర్థిక సమస్యలను పరిష్కరించాలంటే, అవసరమైన ఆర్థికసంస్కరణలు తీసుకురావాలంటే ప్రజాస్వామ్య ప్రభుత్వం అవసరమౌతున్నది. షేక్ అబ్దుల్లా ప్రభుత్వం అప్పుడే కొన్ని ముఖ్య సంస్కరణలను ప్రవేశపెట్టింది. వీనిపట్లనూ, అబ్దుల్లా ప్రభుత్వంపట్లనూ ప్రజలకు విశ్వాసం ఉన్నదని ఎన్నికలలో జాతీయ మహాసభ సంపూర్ణవిజయం నిరూపిస్తున్నది.

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St., Madras



రాష్ట్రసంఘ సేవకుల మహాసభ ప్రతినిధులకు ఆంధ్రరాష్ట్ర టెక్స్‌టైల్-ఫెడరేషన్ అధ్యక్షుడు పచ్చిపులుసు వెంకటసుబ్బారావు విందుచేసినప్పుడు—కొందరితో తీసిన ఫోటో—కూర్చున్నవారు: శ్రీయుతులు నరసింహదేవర సత్యనారాయణ, కె. కె. మిత్ర (ప్లానింగ్ కమీషన్‌లో ఉపకార్యదర్శి) పచ్చిపులుసు వెంకటసుబ్బారావు, డా॥ చలపతిరావు, గోపాలరెడ్డి, శ్రీమతి పింటో, ఒక ప్రతినిధి, కలెక్టర్ నాయక్, యస్. ఆర్ వెంకట్రామన్.



నవంబర్ 1 నుండి సిమ్లాలో జరుగనున్న ఐక్యరాజ్యసమితి ప్రాంతీయ యువజన సంక్షేమ మహాసభలో పాల్గొనే నిమిత్తం, ఢిల్లీవచ్చిన బర్మా ప్రతినిధివర్గం. పాలం విమానాశ్రయంలో ప్రతినిధివర్గం దిగినప్పుడు తీయబడిన ఛాయాచిత్రం. ఎడమనుంచి మూడవ వ్యక్తి ఊ. థాకిన్ ప్రతినిధివర్గ నాయకుడు.

ప్రసిద్ధ ఫ్రెంచి నవలాకారుడు

**అలెగ్జాండర్ డ్యూమా**

రచించిన

# కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో

మొదటి భాగం

అనువాదం:

సూరంపూడి సీతారాం

ఆంధ్రపత్రిక సచిత్రవారపత్రికనుండి పునర్ముద్రితము

వెల: మూడున్నర రూపాయలు

త్వరలో వెలువడనున్నది (రెండవ భాగం)

ప్రకాశకులు:

## ఆంధ్రగ్రంథమాల,

**మద్రాసు 1.**